# సాహిత్య సుందరి



బెజవాడ గోపాలరెడ్డి

ఆం ద సారస్వత పరిషత్తు

SAHITYA SUNDARI

A BOOK OF POEMS IN TELUGU

By Dr. Bezawada Gopala Reddi

మొదటి ముద్రణ:
ఫిబ్రవరి 1980.



వెల: ఆరు రూపాయలు.

ప్రతులకు :
ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్డు—హైదరాబాదు-1

ముఖచిత్ర లేఖనం:
గంగాధర్

ముద్రణ:
క్రాంతి ప్రెస్
మద్రాసు-1

# అంకితము

నన్ను ప్రేమాభిమానముతో చూచుకొనుచు ముత్తైదువులుగ
చనిపోయిన సోదరీమణులు

తిక్కవరపు సుదర్శనమ్మ
రామిరె గారి భార్య)
(1 98— 4-3-1946)

మేనకూరు పంకజమ్మ
(దశరథరామిరె గారి భార్య)
(1900— 8-5-1962)

మేనకూరు శ్రీదేవమ్మ
(బలరామిరె గారి భార్య)
(1902—1 -7-1929)

రేబాల సరస్వతమ్మ
(సుందరరామిరె గారి భార్య
(1904—2 -12-1963

గారల పుణ్యస్మృతికి

తమ్ముడు
బెజవాడ గోపాలరెడ్డి

# గ్రంథకర్త జీవన వివరాలు

జననము— 5 ఆగ॥ 1907,
బుచ్చి రెడ్డిపాళెం, నెల్లూరుజిల్లా.

చదువు— బుచ్చిరెడ్డిపాళెం, నెల్లూరు.
ఆంధ్ర జాతీయ కళాశాల
(1921—24)
విశ్వభారతి
(1924—27)

దేశ స్వాతంత్ర్య సమరము— సర్కారు బడి వదులుట జనవరి 1921.
జైలుశిక్షలు—ఆరుమారులు.
1930, 31, 32, 33 లోను,
1940, 41, 42, 43 లోను,
కొంత భాగాల్లో జైలులో ఉండినారు. దాదాపు 4 సం॥లు జైలులో మకాం. ఎ బి సి క్లాసుల ఖైదీగా డెటిన్యూగా.

ఉద్యోగపర్వము— మంత్రిగా—మద్రాసు, కర్నూలు, హైదరాబాదు, ఢిల్లీలలో—15 సం॥ 6 నెలలు.
గవర్నరుగా—ఉత్తరప్రదేశ్‌లో 62 మాసాలు.
ఆంధ్ర విశ్వవిద్యాలయ ప్రోఛాన్సలర్—జూన్ 1951 నుండి 57 వరకు.

సాహిత్య సేవలు— తెలుగు భాషాసమితి అధ్యక్షులు—1948 నుండి.
ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ—ఆగష్టు 1957 నుండి.
కేంద్ర సాహిత్య అకాడమీ రెండవతూరి—1978 జనవరి నుండి.
జ్ఞానపీఠము—1963 నుండి 1971 వరకు.

# బెజవాడ గోపాలరెడ్డి
## పుస్తకాలు

### స్వీయ రచనలు

1. ఆమె
2. కాలవాహిని
3. సాహిత్యసుందరి

### రానున్న రచనలు

4. ఆమె జాడలు
5. ప్రసూన గుచ్ఛాలు
6. పరిమళ తరంగాలు

### అనువాదాలు

(బెంగాలి నుండి)

1. రవీంద్రుని నాటికలు (5 పుస్తకముల సంపుటి)
2. కథలు—కల్పనలు
3. వానచినుకులు
4. ఊర్వశి—కాళిదాసు
5. నైవేద్యము—స్మరణ
6. తాజ్‌మహల్

(ఉర్దూ నుండి)

7. ఇక్బాల్ కవితలు

దొరికేచోటు :

ఆంధ్ర సారస్వత పరిషత్తు
తిలక్ రోడ్డు, హైదరాబాద్-1.

# విన్నపము

'సాహిత్య సుందరి' పేరుతో 22 ఖండికల కవితల సంపుటిని ప్రచురిస్తున్నాను. పోయిన సంవత్సరము 'కాలవాహిని' సంపుటి వెలువడింది. సాహిత్యాభిమానులు పత్రికలు సంతోషంగానే స్వీకరించారు, సమీక్షలు వ్రాశారు. కవితా సభలోకి వచన కవితా లతో ఆలస్యంగా వచ్చిన నన్ను కూర్చోమని చెప్పారు. వెళ్ళిపొమ్మని మౌనంగాం సైగలతోనో తిరస్కరించలేదు. దానితో ఆత్మవిశ్వాసం బలపడింది. ఈ సంపుటిలో చాలా ఖండికలు 77 సం॥లో వ్రాసినవే. మూడు మాత్రము 78 సం॥ వ్రాయబడ్డవి. 77 సం॥ మే నెలలో ప్రారంభమైన నా కవితాధోరణి 78 సం॥ డిశంబరు వరకు బాగా సాగింది, 79 సం॥ లో మందగించింది. నాకు జబ్బు చేయడం, మద్రాసు ఆసుపత్రిలో చికిత్స పొందడం 79 సం॥ మధ్యలోనే జరిగింది. కాని రెండు వందలకు పైగా ముక్తకాలైన పద్యకాలు 'ఆమె జాడలు' మార్చి మొదలు మే లోపల వ్రాశాను. సెప్టెంబరు నుండి తిరుగ వ్రాస్తున్నాను..

'సాహిత్యసుందరి'లో మొదటి ఖండిక శకుంతల. భారతములోని కథావేశాన్ని గైకొని కాళిదాసు కమనీయమైన నాటకాన్ని రచించి శకుంతలను అపూర్వ సుందరిగా మన యెదుట ప్రత్యక్షము చేశాడు. ప్రపంచానికే పరిచితురాలిగా చేశారు. సాహిత్యములో చిరంజీవత్వము పొందిన సుందరి, కాన సాహిత్యసుందరి అని పుస్తకము పేరిడినాను.

శ్రీరాముడికి అట్టి అదృష్టమే ప ంది. వాల్మీకి వల్లనే రాముడు అవతార పురుషుడయ్యాడు. వాల్మీకిని ఉద్దేశించి నా దుని ముఖతః రవీంద్రుడు ఏమన్నాడో చూడండి.

"నీవు రచించునదియే సత్యము
యదా ముగ జరిగిన దంతయు
సత్య ంకాదు.
కవీ, అయోధ్య కన్నను నిక్కముగా
నీ మనోభూమియే
రాముని జన్మ ్వమని నీ వెరుగుము."

వాల్మీకి వలన రాముడు, కా దాసువలన శకుంతల అమరులై వెలుగొందుచున్నారు.

అంతేకాక 'సాహిత్యసుందరి'లో కొన్ని మహిళలకు సంబంధించిన కవితా లు కొన్ని సాహిత్యశేఖరులకు సంబంధించినవి మరికొన్ని నా అభిప్రాయాలను ప్రతి బింబించే కవిత్వాలు ఉన్నవి.

నా శకుంతల కవిత్వాన్ని విని ఆనందించి ఉస్మానియా విశ్వవిద్యాలయ సంస్కృతశాఖలో ఆచార్యులుగా నున్న డాక్టరు బి. ఆర్. శాస్త్రిగారు సంస్కృతము లోనికి అనువదించారు. మూలానికి దగ్గరగా శాస్త్రిగారి అనువాదము నడిచింది. హైదరాబాదులో, విశాఖపట్టణములో వారు వినిపింపగా సంస్కృత పండితులు సంతో షించారు.

ఆంధ్ర విశ్వవిద్యాలయములో హిందీ విభాగ అధ్యాపకులగు డాక్టరు ఆదేశ్వర రావుగారు 'కాలవాహిని'లోని కొన్ని ఖండికలను హిందీలోకి అనువదించి ఆధునిక తెలుగు కవితలను పుస్తకములో చేర్చుకొని ముద్రించినారు. మద్రాసు శ్రీ డి. ఆంజ నేయులుగారు కొన్ని ఖండికలను ఇంగ్లీషులోనికి అనువదించి సాహిత్య అకాడమీ మాసపత్రికలో ప్రచురించినారు. ఈ అనువాదాలు పత్రికా సమీక్షలతోపాటు నా ఆత్మ విశ్వాసాన్ని పెంచినాయి. ఇంగ్లీషు తెలుగు పత్రికలలో సమీక్ష చేసిన పెద్దలకు అనువ దించిన పెద్దలకు నా కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాను.

శకుంతల అవివాహిత అను రెండు ఖండికలు 1977 సం॥లోనే రచింప బడ్డాయి. అచ్చులో పొరపాటుగా 1979 సం॥లో ముద్రింపబడ్డది. క్షమించి ఈ మార్పును సహృదయులు గమనించగలరని వేడుచున్నాను.

'వాగర్థాయివ సంపృక్తౌ' అను రఘువంశ ప్రథమ శ్లోకానికి వచ్చినంత ప్రాశస్త్యము మరి ఏ శ్లోకానికి రాలేదని, అందుకనే అది వాడనిపువ్వు అయిందని వ్రాశాను.

'రామచరిత మానస' అనే తులసీదాసు హిందీ రామాయణానికి వచ్చినంత ప్రాశస్తము, భారతీయ భాషలలో మరి ఏ గ్రంథానికి రాలేదని అభిప్రాయపడ్డాను.

శ్రీరామచంద్రుని అనుజుడు భరతుడు ఉదారచరిత్రుడు. అతని పేరుననే మన దేశము భరతఖండమైనదని శకుంతల ఖండికలో అభిప్రాయపడినాను. 'రాముని పేరుతో రాజ్యం' 'భరతుని పేరుతో దేశం' అని అన్నాను. ఇతర భరతులకన్న రామాయణ భరతుడే నాకు వచ్చినాడు.

ముద్రణ విషయములో యథారీతి సాయపడిన చందూరు దంపతులకు, ముఖ్యముగా మాలతిగారికి కృతజ్ఞతను తెలుపుచున్నాను.

1-1-1980
నెల్లూరు

బెజవాడ గోపాలరెడ్డి

# వి ష య సూ చి క

# 1

## జననం

శకుంతములచే పెంచబడ్డది
అందుకనే శకుంతల పేరొచ్చింది.
ఎందుకు పక్షులే పెంచాయో
వింటుంటే వింతగా వుంటుంది కథ.
ఋషిపుంగవుడు విశ్వామిత్రుడు
బ్రహ్మత్వం పొందాలని కోరాడు.
కఠి మైన తపసు కు పూనాడు.
ఘోర తపస్సుకు ఎవరు కూర్చున్నా
కలతపడతాడు సురాధిపతి దేవేంద్రుడు
వరాల పొంది తన గద్దె మీదనే
ఆసీనులౌతారని నిరంతర భయం
తపమును చెడగొట్టాలని ప్రయత్నం.
ఎప్పుడూ అదే ఆలోచిస్తుంటాడు.
అన్నీ వదలి అరణ్యాలు చేరినా
కామం మాత్రం వారిని వదలదు
ఆ గుట్టు దేవేంద్రునికి బాగా తెలుసు.
లోకజ్ఞానం కలవాడు, గొప్ప అనుభవశాలి
లేకుంటే మాయారూపంతో
అహల్యని, ఋషి భార్యను
వంచిస్తాడా. ఆమెకు తగిలిన
శాపానికి కారణభూతుడవుతాడా
సహస్రాక్షుడు అనే బిరుదును
పొందినవాడు, ఆయనొక్కడే.
ఇంద్రుడి తూణీరములో కొన్ని అస్త్రాలున్నాయి
అమోఘంగా పనిచేసే బాణాలున్నాయి.
సజీవమైనవి, నవ్వేవి, మాట్లాడేవి.
రంభా మేనక ఊర్వశి తిలోత్తమలు
ఋషుల మీద విసరే గుప్తాస్త్రాలు.

విశ్వామిత్రుడి మీదకు మేనకను ఉసికొల్పాడు
సు వేశ లకు అలవాటైన ఉచ్ఛల పన్నింది
క్రమ కొ ్నది, కవ్వించింది, పాడింది, ఆడింది.
ఎవరెస్టు శిఖరం ఎక్కి, జండా నాటినట్లు
గర్భం తాల్చి విజయ పతాకను ఎగరేసింది
స్వ ం నుండి దేవేంద్రుడు చూచాడు
ఆ ందించి సెబాషంటూ ఆడాడు
సురలందరిని సురాపాన గోష్ఠులకు పిలిచాడు
సాఖీలు అందించారు, సురలందరు త్రాగారు.
ఆ విజయ చిహ్నమే స్త్రీ శిశువై పుట్టింది.
వ్రత భంగములో, ధర్మచ్యుతిలో పుట్టింది
పెండ్లాడని సుర వేశ్యకు పుట్టింది.
మేనక తిరిగి ర్గానికి పోవలసిన వేళైంది
బిడ్డను తీసికో, వే పెంచుకో
అని శిశువును చూపి చెప్పింది.
విశ్వామిత్రుడు సిగ్గుపడి, పెడమొగం పెట్టి
నేనెట్లా సాకేది, నా వల్ల కాదు
నేను ఋషిని, తపస్సుకు వచ్చాను
పడినా, తెప్పరిల్లుకొని సాగిస్తాను
వ్రతము పూర్తిచేసి, పెద్ద పదవుల పొందాలె
ఆ బిడ్డను తీసుకోను అని నిరాకరించాడు.
వ్రతభంగములో పుట్టింది. ధర్మచ్యుతి జరిగింది
జనకునిచే నిరాకృత అయ్యింది.
మేనక కోపపడి, విసుక్కొని
నరలోకపు మొగాళ్లు ఇట్లానే చేస్తారు
నాకు వేళైంది, నేను స్వర్గానికి వెళ్ళాలి
అంటూ ఎండుటాకులలో పడవేసింది
ఎండుటాకుల కప్పి, రివ్వున ఎగిరి వెళ్ళింది.
దేవేంద్రుడు స్వాగతమిచ్చి బహూకరించాడు
నీ బోంట్లు వుండబట్టే నా ఆసనం నాకు మిగిలింది
అని కొనియాడాడు, పూమాలను వేశాడు.

అటుల జననిచే పరిత్యక్త అయ్యింది
పక్షులు రెక్కలతో గొడుగులు పట్టాయి
మాలినీ నదిలో స్నానం చేసి వస్తుండిన
కణ్వ మహ  కంటబడింది
తన ఆశ్రమము కు తీసుకవెళ్ళి
శకుంతల అని పేరు పెట్టాడు.
ఇతర ముని కన్యలతో పాటు
ఆడుచు పెరుగుతు వచ్చింది.

## 2

## బాల్యం

కణ్వునికి ఆమె అంటే చాలా ఇష్టం
ఆమె జనన నిస్సహాయతే
ఆమెకు ప్రేమ కవచం అయింది
తల్లీ తండ్రీ లేని అనాథ శిశువు
ఋషికి అనురాగపు పట్టి అయ్యింది.
అందరి పేమల పొందుచు
ఆశ్రమము ంతా అలరించేది.
తల్లి పోలికలు వచ్చాయి
స్వర్గపు వెలుగులు వెలిశాయి
వెలుగు బంతివలె తిరిగేది
సెలయేటి నవ్వుల నవ్వేది
వెన్నెల ముద్దవలె, వెన్న ముద్దవలె
అందంగా, లతవలె వుండేది.
తియ్యని మాటలు చెప్పేది.
కదలికలేని ఆశ్రమములో
ఆనందపు కదలికను కూర్చింది
బుజ్జి ఆశ్రమ దేవతవలె ఎగిరేది
మృగ శాబకాలకు ఘాసము పట్టేది
గోవత్సలకు తోడి నీరు పెట్టేది
నెమళ్లు చూచి ఆడేది

కోయిలకు మారు పలికేది
పూల చెట్లకు నీరు పోసేది
తీగెల చెట్లను త్రిప్పేది
ప్రొద్దునే పూలను తెచ్చి
పూజా వేదికపై పెట్టేది.
సంధ్యా హోమానికి సమిధల కూర్చేది
ఋషి అంతా చూస్తూ సంతోషించాడు
తల్లిలేని బిడ్డకు తల్లి మమత వలె
తండ్రిలేని బిడ్డకు తండ్రి ఆదరము వలె
చూస్తూ పాలించాడు, ఋషి శకుంతలను.
తపః ఫలాంశమే శకుంతల
అని భావించాడు
దీక్షా పుష్పరేణువే శకుంతల
అని సంతోషించాడు.

## 3

## యౌవనం

కొన్ని వసంతాలు గడచాయి
కొన్ని వర్షాలు అభిసిక్తం చేశాయి
లత లతాంగిగ తేలింది
షోడశి, సర్వాంగ సుందరి అయ్యింది
యౌవన కోకిల రాగాలాపన చేసింది
యౌవన మయూరం పింఛము విప్పింది
యౌవన మరాళం పక్షముల చాపింది
ఏణాక్షియై, బెదురు చూపుల చూసింది
దేహ తటమున నవతరంగాలు ఆడినాయి
హృదయ వనమున నవపవనాలు వీచినాయి
మనోవీథిలో మబ్బుల వలె
క్రొత్త తలపులు, క్రొత్తకలలు
నిరుద్దేశ్యముగ తిరిగాయి
శిరోజాలు చీకటి వాగులయ్యాయి

కంఠం మరింత తియ్యగ పలికింది
కపోలాలు మరింత కింశుక వర్ణాన్ని తాల్చాయి
అధరము మరింత సంధ్యారాగాన్ని పొందింది
అట్లా సౌందర్య శిఖ వలె
తేజఃపుంజము వలె
స్వర్గ సౌందర్యాన్ని
ప్రతిబింబించే
రత్న దర్పణం వలె
పూర్ణేందువు వలె
తలిరుబోడి అందాల రాశియై
ప్రాణము పొందిన సౌందర్యమై
ఆశ్రమ మందార మంజరియై
పారిజాత గుచ్ఛమై వెలసింది.
అనసూయ ప్రియంవదలు సఖులు కాగా
కామ దేవుని కుసుమ శలాకల వలె భాసించారు
ఆశ్రమ కుటీర వాసము
వల్కల ధారణము
కందమూలముల భక్షణము
భూతల శయనము
వారి అందాలను పెంచాయి
హోమాగ్నులలో వారి వెలుగులు మెరిసాయి

## 4

## వివాహం

కణ్వుడు తీర్థయాత్రకు వెళ్ళాడు
దుష్యంతుడు గంగానదిని దాటి
మాలినీ తీరానికి వేటకు వచ్చాడు
జింకను వెంటాడుచు, మృగనయనల చూచాడు.
తిమిర గగనాన శుక్ర తార వలె
వర్షా రాత్రుల సౌదామినీ లత వలె
మెరుస్తుండిన శకుంతలను చూచాడు

ఆమె రూపామృతాన్ని కండ్లతో త్రావుచు నిలిచాడు
ఆమె యౌవన శోభను తిలకిస్తూ ము ́డయా డు
సఖీజన సహాయముతో ఆమెను పలు రించాడు
పరిచితుడయ్యాడు, ప్రేమికుడయ్యాడు.
శిబిరము నుండి ప్రతి సాయంత్రము వస్తూ
నిరీక్షిస్తుండిన కన్యాత్రయమును చూస్తూ
రెండు మూడు దినాలు గడిపాడు.
దుష్యంత శకుంతల అన్యోన్యానురాగాలు
పసికట్టారు అనసూయా ప్రియంవదలు
ఏదోనెపమున వారిని వదలి వెడలే వారు
ఏకాంతమున నర్మ భాషణలు పలికాడు.
కన్నుల కలిపి, చేయిపట్టి అదిమాడు
మెల్లగా లాగి కౌగిట చేర్చుకొన్నాడు
ముద్దిడి భయపడవద్దని ఓదార్చి చెప్పాడు
సంధ్యాంధకారాలు నిబిడములయ్యాయి
మోసులెత్తిన అనురాగ లతలు మొగ్గలు తొడిగాయి.
రాజకార్యములు పేరుకొనగా
హస్తిన నుండి పిలుపు వచ్చింది
ఉంగరమిచ్చి గాంధర్వమున పరిణయ మాడాడు.
త్వరలో వ ` ఆమెను హస్తినకు
తీసుకపోతా ని మాటలు ఇచ్చాడు
ఓదార్చాడు, ముద్దిడి మరలి వెడలినాడు.

## 5

## శాపము

కణ్వుడు లేని సమయాన
అయన అనుమతి పడయక
ఆశీర్వాదముల అభిలషింపక
బహు భార్యల గల రాజును
ఆశ్రమ కన్య వరించింది.
గాంధర్వమున పెండ్లాడి

గర్భము తాల్చింది.
తపోవన నికుంజాలే
వారికి మరుగులు చేర్చాయి
ఆశ్రమ హోమాగ్నులే
దారులు చూపాయి.
మాలతీ లతికలే
వారి గుసగుసలు విన్నాయి
ఇసుకల జాడలే, గుట్టుల తెలిపాయి.
జరిగిన ఉదంతాల మధువును
బిందు బిందువుగ పానము చేస్తూ
అన్యమనస్కయై శకుంతల ఉండింది.
ఆనందము భయములు
మనమున రేగుచు వచ్చాయి
సందేహ సర్పములు
మనమున బుసలు కొట్టుతూ వచాయి.
ఏదో తెలియని ఆ దన
బాధిస్తూనే వుండింది.
మాటిచ్చిన రాజు రాలేదు
పెట్టిన గడువు దాటింది
తలపుల జాలములో
చేపవలె తగుల్కొని ఉండింది
ఆహారము అరుచి అయ్యింది
నిద్రలేని రాత్రుల గడిపింది
గమనించలేదు దూర్వాసుని రాకను
అతిథుల సత్కారముల
చేయకపోయెను.
మండిపడి ముక్కుమీద కోపమును
నాలుక మీదకు తెచ్చుకొని
శకుంతలను శపించెను ముని వరేణ్యుడు
'నీ కోరిక సఫలము కాదు'
అని గద్దరించి పలుకుచు వెడలెను.

శాప బాణాలు పొందుటకేనా
తపములు చేసేది?
కోపముతో మండిపడి
అన్నెం పున్నెం ఎరుగని వారిని
శాపము పెట్టుటయేనా ధర్మము?
ఆలోచించరు మునీంద్రులు
నోటికి వచ్చినట్లు తిట్తారు
దానినే శాపమని అంటారు.
మూర్తీభవించిన కోపాగ్ని
మునీశ్వర మహాశయుడు
ఆర్జించిన తపః ఫలాన్ని
రిక్తముచేసి వెళ్ళాడు
అయ్యో, పాపం శకుంతల
జనకునిచే నిరాకృత
జననిచే పరిత్యక్త
ఇప్పుడు మునిచే అభిశప్త.

## 6

## వీడ్కోలు

యాత్ర నుండి తిరిగి వచ్చాడు కణ్వుడు
జరిగిన విషయాన్ని తెలిసికొన్నాడు దివ్యనేత్రంతో
శకుంతలను హస్తినకు పంప సిద్ధము కమ్మన్నాడు
అందరి అనుమతి తీసుకొనే వేళ
కణ్వుడే కంట నీరు పెట్టాడు.
'నేనే ఇట్లా అయితే, కూతుళ్ళను
అత్తవారింటికి పంపే కన్న తండ్రులు
ఏమవుతారు?' అని జాలిగ ప్రశ్నించాడు
తీగలను, జింకపిల్లను, ఆవుదూడను
నిమిరి నిమిరి తిరిగి చూచి చూచి
సెలవు తీసికొన్నది కళ్ల తడితో.
అనసూయ ప్రియంవదలు

కన్నీరు అపుకొంటూ, గద్గద కంఠముతో
ధైర్యపు మాటలు చెప్పుచుండినారు
మరపురాని దృశ్యమది
ఆబాల్య సహచరుల
విడిచి వెళ్లుట సాధ్యమా
ఒక్కసారిగ స్నేహబంధములన్నీ
త్రుంచి వెయ్యాలె.
తెలియని పరిసరములలో జీవితం
క్రొత్త చుట్టాలు, క్రొత్త స్నేహితులు
క్రొత్త ఇంటికి కోడలై పోవాలె.
జీవితములో అల్లుకొన్న పాతవన్నీ వదలాలె
పేమ పిలుపది, హ ధర్మమది
జీవితములో ప క్షా సమయం.
కణ్వుని పాదాలకు నమస్కరించి
బయలుదేరింది గౌతమితో మరిద్దరు శిషు లతో
రాజసభా మండపం రారు
శకుంతలను చూపుచు, కణ్వుని
సందేశం వినిపించారు.
శాపముచే వివాహము
జ్ఞప్తికి రాలేదు
అమెను ఒల్లనని గట్టిగా చెప్పాడు
ఏమి చెప్పినా, ఇవి మీ పన్నుగడలన్నాడు.
గర్భవతి పరకళత్రం అన్నాడు
అట్లా భర్తచే విసర్జిత అయింది శకుంతల.
'మాతో రావద్దు, పతి గృహములో
సేవా దాసివిగా వుండిపో' అని శిష్యులు
చెప్పి వెళ్లారు గౌతమితో కూడ.
ఏమి దిక్కు శకుంతలకు భూగర్భం తప్ప?
ఏడ్చింది, విలపించింది.
ఆకసము నుండి జ్యోతి వచ్చి
మారీచాశ్రమం చేర్చింది.

## 7

## భరతుడు

శాపము తీరగ, దుష్యంతుడు
అన్నీ మనస్సుకు తెచ్చుకొని
చేసిన నేరానికి పశ్చాత్తాపపడి
ఆమెను కలియవలెనని కోరాడు.
ఎక్కడుందో, ఏ కష్టాల పడుతుందో
అని మాటిమాటికి తలచుకొని విలపించాడు.
విజయ యాత్రకు వెడలి, తిరుగు మార్గంలో
మారీచాశ్రమము చేరి, కడు సాహసంతో
సింహం పిల్లతో ఆడుచుండిన
బాలకుని చూచాడు.
మాటల మాటలలో అతడు
ఇతని కొడుకనే తేలింది
అతని తల్లే శకుంతల యని తేలింది.
అందరి ఆశీర చనములతో
ముగ్గురు హస్తిన చేరారు.
ఆ బాలకుడే భరతుడు
పెద్దై రాజ్యము ఏలాడు
మనదేశము అతని పేరుననే
భరత ఖండం, భరత వర్షం
అయిందని అంటారు.
కొందరు జడ భరతుడు వేరు
అతని పేరున వచ్చిందీ పేరు
అని అంటారు.
శకుంతల కొడుకు, జడభరతుడు
ఏ గొప్ప పనుల చేశారో
ఏ మేళ్లు చేసి, ప్రజలకు క్షేమం కూర్చారో
మనకు ఏమీ తెలియదు.
మనకు తెలిసిందంతా

రామాయణములోని భరతుడు
తండ్రి ఆనతిచే రాజ ం వదలి
అడవుల పాలైన రాముని కన్న
ఎక్కువ త్యాగం చేశాడు.
వచ్చిన రాజ్యాధికారాన్ని వలదని
అన్నను మరలి రమ ని పిలిచాడు
రాముడు నిరాకరింప
అతని పాదుకల శిరమున తాల్చి
సింహాసనమున వానిని వుంచి
రాముని మారుగ రాజ్యము ఏలాడు.
అడవులనున్న రాముని వలెనే బ్రతికాడు
త్యాగశీలి ఈ భరతుడు
ఉదాత్త చరిత్రుడు ఈ భరతుడు
ధర్మనిష్ఠా గరిష్ఠుడు ఈ భరతుడు
ఇతని పేరుననే వచ్చింది పేరు.
భరత ఖండం, భరత వర్షం
రాముడి పేరుతో రాజ్యం
భరతుడి పేరుతో దేశం.

## 8

## కాళిదాసు

శకుంతల ఎక్కడ పుట్టిందో
ఎక్కడ తేలిందో!
జీవితమంతా కన్నీటి కాల్వలే
తండ్రి వద్దంటే, తల్లి వదిలేస్తే
ముని శపిస్తే, భర్త కాదంటే
మిగిలిందేమి జీవితములో!
ఈ సామాన్యమైన ఇతిహాసం
భారతములో వున్న కథాలేశం
మహాకవి కాళిదాసు కంటబడింది.
సానలు తీర్చి, అందాలు చేర్చి

నూతన ప్రాణప్రతిష్ఠ చేశాడు
సాహిత్య సౌందర్యమూర్తిని చేశాడు.
భూమ్యాకాశముల సౌందర్యమంతా
శకుంతల నాటకములో నిహితమైనది
అన్నాడు జరన్ కవిచక్రవర్తి గీటే.
శకుంతల అ గానే
కాళిదాసు ´ రణకు వస్తాడు
బాల్యంలో ణ్వుడు ఆమెను పెంచితే
యౌవనంలో కాళిదాసు పోషించాడు
సాహిత్యంలో అమరత ం కల్పించాడు
అక్షరమైన సౌందర్య సృష్టిని చేశాడు
కాళిదాసు వల్లనే కణ్వుడు దుష్యంతుడు
అందరికీ పరిచయులయ్యారు
శకుంతల ఆశ్రమమునుండి
వెడలే దృశ్యంలో
మానవుడికి ప్రకృతికి
ఎంత నికట బాంధవ్యమో తెలిపాడు.
కణ్వుని అశ్రువులలో
విశ్వజనీనమైన బాష్పములు
ప్రతిబింబించాయి
శకుంతల తడబాటులో
వి మంతా కరిగిపోయింది
సౌందర్యామృతముతోనే
అభిషేకం చేశాడు శకుంతలను
కాళిదాసు కమనీయ కల్పన శకుంతల

# 9

పార్వతీ పరమేశ్వరుల
ఆస్థాన కవి కాళిదాసు
అన్నాడు టాగూరు
కుమార సంభవాన్ని

వారికి చదివి వినిపిస్తుంటే
ప్రకృతియంతా చెవుల విప్పి విన్నదని
వివాహ వివరాలు వ స్తుంటే
పార్వతి సిగ్గుపడిందని
ఆమెను చూచి అంతటితో
కావ్యాన్ని ఆపాడని ఉత్ప్రేక్షించాడు.
వివాహానంతర సర్గలను
కాళిదాసు వ్రాయలేదని చమత్కరించారు.

## 10

కాళిదాసు జీవితంలో ఎన్ని కష్టాలు పడ్డా
ఎన్ని విమర్శనలకు గురియైనా
లెక్క చేయక, ఏడు కావ్యాలను
మన వారసత్వంగా ఇచ్చిపోయాడు.
సంగీతములో ఏడు స్వరముల వలె
సూర్యనారాయుని ఏడు గుర్రముల వలె
అవి మన మూలసంపద అయ్యాయి.
అవి అమాన సౌందర్య కమలాలు
కవివరుని ఆనంద సూర్యకాంతిచే
వికసించాయి.
కష్టాల విషాన్ని తానే మ్రింగి
కావ్యామృతాన్ని మనకు పంచిపెట్టాడు.
అట్టి అమృత మూర్తియే శకుంతల
కష్టాలన్నీ ఆమె పడ్డది,
సాహితా మృతము మనకు దక్కింది
కాళిదాసుచే చి ధన్య శకుంతల అయ్యింది.
నెల్లూరు, 8-7-79

## 1

## అవివాహిత

ఆమె పట్నంలో చదువుతుంది
స్నాతకోత్తర తరగతిలో
విద్యార్థులతో విద్యార్థినులతో
మెలకువతో చనువుగ వ్యవహరించేది.
చదువులలో ఆటలలో ఆసక్తిగ వుండేది.
ఉదారభావాలతో, ఆధునిక ఆదర్శాలతో
జీవితాన్ని నడపాలని తలుస్తుండేది.
అందరికీ పరిచయమే, ఎవరినీ ప్రేమించలేదు
ప్రేమించినా, ప్రదర్శనశాలలో చూపేది కాదు
పరిణయమాడాలని, హిణియై
సంఘసేవ చేయాలని అంటూ వుండేది.

## 2

పెండ్లి ఎప్పుడో, వరుడెవడో
ఏ ప్రాంతమువాడో, ఏ కులస్థుడో
ఏమీ తెలియని కాలమది.
ఆడపిల్లల భవిష్యత్తు ఏమిటో
ఊహించుటకైనా వీలులేని స్థితి అది
ప్రేమించి పెండ్లా, పెండ్లాడి ప్రేమా
చెప్పుటకైనా తోచని సందిగ్ధము.
దిక్కులు తెలియని గగనవిహారం
సందిగ్ధపు మేఘాలు మనోదిక్చక్రాన్ని క్రమ్మి
భావికాలాన్ని మరుగు పరచేవి.
జీవనపటఫలకమున ఎట్టి మనోరథాలు
చిత్రాల ాయుచు ఉండాలో
స్వప్నత ణి ఏ ప్రేమపాశాలతో
తేలుచు, ఏ రేవున లంగరు వేయాలో
యౌవనసుధను, ఎవరి అధరములకు
అందిచ్చి మైమరపును కూర్చాలో

రూపకాంతిని, ఎవరి నేత్రపర్వము చెయా లో
బిగికౌగిటిలో ఎవనికి తియ్యని గుసగు లో
పల్లెసీమో, పట్టణమో కాపురము.
ఏమి చేసేవాడో, ఏ ఉద్యోగమో
లాయరో, వైద్యుడో, ఉపాధ్యాయుడో
ఫ్యాక్టరీలో పెద్దపనా, బ్యాంకులో గుమాస్తా
వ్యాపారస్థుడా, వ్యవసాయదారుడా
ఏమీ చూపని గోడ అది.
భావికాలాన్ని మడచి దాచిన పెట్టె అది.

## 3

ఎచ్చట కూర్చుని దేవుని స్మరిస్తాడో
మందిరమా, గురుద్వారము, మస్జిద్, చర్చా
ఏ పండుగలను జరపాలో
ఏ మతగ్రంథాలను పఠించాలో
ఏ భాషను మాట్లాడేవాడో
ఏ కవుల జయంతుల వర్ధంతుల జరిపేవాడో
ఏ సంప్రదాయ కుటుంబము వాడో
చదువు సంధ్యలు కల కుటుంబమో, కాదో
ఆస్తీ పాస్తీ, ఇల్లూ వాకిలి వున్నవారో కాదో
పటాలములో చేరి, దీర్ఘ కాలము
భార్యకు దూరంగా ఉండే వాడేమో
ఉద్యోగంకొరకై నిరీక్షిస్తూ
దరఖాస్తులు పెట్టేవాడేమో
త్రాగుడుకు అలవాటుపడిన వాడే కావొచ్చు
కోపిష్ఠి కావచ్చు, సౌమ స్వభావుడే కావొచ్చు
భార్యను గౌ వించేవాడే కావొచ్చు
భావాలు సరిపడక, విడాకులిచ్చే వాడే కావొచ్చు
పూలతో పూజించి, పద్యాలతో నుతించే
ప్రేమ ఉద్యానవనములో
విహరించే రసికుడే కావొచ్చు

భావికాలము మూగదై యేమీ చెప్పదు
నేడుతెరవెనుక అణిగి దాగి వుంటుంది
పుట్టలో నిద్రించే పాములాగే వుంటుంది
లేచి మణులే ఇస్తుందో, విషాన్నే ఇస్తుందో.

## 4

ఏ వివాహమండపములో వధువుగా కూర్చోవాలో
ఎక్కడివారో బంధువులు స్నేహితులు
అత్త ఎటువంటావెూ, ఆడబిడ్డలు ఎట్లా వుంటారో
ఇంట్లో ఎవరెవరుంటారో
మంచము పట్టిన మామ వుంటాడేమో,
ఎవరెవరి సపర్యలచేయుచు వుండాలో
భార్యయై ఎవరి అనురాగాల పొందాలో
గృహిణియై, ఎట్టి అధికారాల చెలాయించాలో
ఎచ్చటి పాలాలను పశువులను మావేయని
తలచుచు, సంరక్షణ చేయాలో
మాతయై ఎట్టి బిడ్డల కంటుందో
ఏ వాతావరణములో సంఘసేవ చేయాలో
వ్యక్తిత్వాన్ని నిజాయితీని చూపగలదో
తన స్వభావముచే అందరినీ ఆకట్టుకొని
ప్రభావితులను చేస్తూ
పేరు ప్రతిష్ఠలు గడిస్తుందో
ముందు చూపులేని కాలమది
స్వప్నాలు చొరని దుర్గమది
నిరంతర సందిగ్ధ తమస్సులు
వెంబడించే వలపుబాట అది
చిరునవ్వుల, కన్నీళ్ల మూట అది
అన్నీ కలిసొస్తే, తియ్యని పాట అది
కలలు పండించే పసిడిపంట అది
వివాహం, గార్హ్యస్తం, మాతృత్వం
ఆమెకు కావాలని కోరుకొంటున్నాను.

నెల్లూరు, 3-9-79

# నిరుద్యోగ యువతి

అనకాపల్లిలో ఆటోగ్రాపులిస్తూ
అడిగాను యేమి చదువుతున్నారని
ఆమె బి.ఏ., బి. యిడీ ప్యాసైంది
ఉద్యోగం దొరకడం లేదు
నేను పరిశోధన చేస్తున్నానని అనింది.
మీరు ఉపన్యాసాల్లో చెప్తారు లేండి
నిరుద్యోగ రాక్షసిని చంపలేకపొయ్యారు
అన్నది బి.ఏ, బి.యిడి గంభీరంగానే
నేను మౌనం తాల్చాను.
విశాఖ వచ్చి, దీపం ఆర్పి
పరుండియుంటే, జ్ఞాపకానికి వచ్చాయి
ఆమె గంభీరంగా అన్న పలుకులు.

## 2

దేశంలో వున్న నిరుద్యోగ సమస్య
చదువుకున్న వారి నిరుద్యోగ సమస్య
చదివిన అమా యిల నిరుద్యోగం
ఎంత భీషణమైన, భీక మైన సమస్యలు.
దినదినానికి తీవ్రతరమగుతున్నాయి
చదువుచున్నవారు ఎక్కువగుచున్నారు
ఇంకొకవైపు. ఉద్యోగము దొరకక
సంకటపడుచున్నారు.
ఎన్ని తెలివితేటల ఫలితమో ఈ చదువు
ఎన్ని ఆశాబీజాలు పండించిన పంటో ఈ చదువు
ఎన్ని కష్టనష్టాలకు గురియైతే వచ్చిందో ఈ చదువు
బి.ఏ అయింది, బి.యిడీ ప్యాసైందని
సంతోషించారు
బంధువర్గమంతా, తల్లితండ్రులతో కలిసి
అభినందించారు ఆ అమ్మాయిని ఆనందంగా

చదివినకొద్దీ కష్టమైంది పెండ్లికావడం
ఉద్యోగము దొరకక, నిరాశ చెందింది అమ్మాయి.
ఆ నైరాశ్యపు మూటలో మాటలే, ఆమె పలికింది
తల్లిదండ్రుల కలలు; కల్లలైన విషయమే చెప్పింది
ఆమె తెల్లని నవ్వుల పర్దాలో దాగినవి నల్లని
సత్యాలు
ఆశాలతలలో కనిపిస్తున్నాయి ఎండిన ముకుళాలు
ఊహా నందనవనములో లేవు పికశారికా కూజితాలు
యౌవన పౌర్ణమిలో విహరిస్తున్నాయి అమావాశ్యా
తమస్సులు
ఉదయించే వలపులలో మబ్బులు ముసిరాయి
చిగిరించే తలపులలో కీటకాలు చేరాయి
జీవితములో స్వరాలకన్నా అపస్వరాలే
వినబడుతున్నాయి.
ఊహా నేత్రానికి వనాలకన్నా
ఎడారులే కనబడుతున్నాయి.

## 3

నాయకుల దీర్ఘోపన్యాసాలతో తీరే సమస్యకాదు.
ఎన్నికల వాగ్దాన కనకవర్షాలతో పండేపంట కాదు
ఇంద్రజాలంలో మంత్రదండంతో తెమిలే
మాటకాదు
నా ఉపన్యాసం వినడానికి వచ్చింది
ప్రజాస్వామికము సాధించిన విజయాలన్నీ విన్నది.
ఏ కిరణకాంతులు ఆమె ఎదలో చీకట్లను
చీల్చగలవు
ఏ అమృతబిందువులు ఎండే నాలుకను తడి
కూర్చగలవు
ఏ మెత్తని ఓదార్పు మాటలు,
భావకాఠిన్యాన్ని శాంతింపగలవు
నిశీథ నీరవనయనాశ్రువుల తుడిచివేయగలవు

ఆమె పెదవుల పందిరిలో,
ఆశాస్మితసుమాలు వికసిస్తాయా
మనోకాసారములో శ్వేతమరాళాలు విహరిస్తాయా
యౌవన ప్రపంచపత్రములలో దోగాడే
శిశువులు కన్పిస్తారా
జరిగే దేశనిరా ఐ యజ్ఞములో
ఎందరు అజ్ఞాత నరనారులు మిథలైపోవాలో!
తారుణ్య సౌందర్యముతో ఆమె ముఖముదీప్తిస్తుంది
ముఖయవనిక వెనుక, తీరని సమస్యలు
పుట్టలు కట్టాయి.

నెల్లూరు, 15-9-77

# నటీమణి

ఆమె

చిత్రగగనాన శుక్రతారవలె మెరిసింది
అనేక చిత్రాల్లో ఒకేసారిగ నటించింది
బహుభాషల్లో చిత్రచిత్రవేషాలను వేసింది
పత్రికలన్నీ గోడలన్నీ ఆమె పేరునే పలికాయి
యువకులు పెద్దలు చిత్రశాలల మూగారు
స్వాగతాలు శతదినాలు మెండుగ జరిగాయి
ఆమె లేనిదే చిత్రము లేదని తలచారు
ఆమెతో హీరోగా వేయడమే భాగ్యమన్నారు
అంతా వెలుగుల మూటగా
పువ్వుల బాటగా వెలిసింది
జన్మదినాన గత్తరగ వేడుకలు చేశారు
ఆటోగ్రాపులు కోరే బాలబాలికలు చేరారు
పున్నమనాటి చంద్రునివలె,
మధ్యాహ్న సూర్యునివలె
జీవితమంతా గడవగలదని భావించారు.

## 2

ఆ వేడుకలోనే మూలదాగి ఎవరో నవ్వారు.
బ్రతుకు పైడిజింక వేటయని గుసగుసలాడారు
మంచుమబ్బుల సొంపులని కన్నుల గీటారు
ఇంద్రధనుస్సుల సప్తవర్ణములని లోలోనన్నారు.
సౌదామినీ కాంతల వాగ్దానాలని తలచారు
వత్సరాలు గడిచాయి, కాలము వక్రించింది
శుక్రతారకు మూఢమి వచ్చింది
పున్నమచంద్రుణ్ణి రాహువు పట్టింది
మధ్యాహ్నసూరుణ్ణి మబ్బులు మూశాయి.
అంతా నిశాంత సుఖస్వప్నము రీతి కరిగింది
వేడుకల మతాబులు చల్లని నిద్రల పొందాయి
జబ్బుచేసింది, ఒడలంతా ఉబ్బింది.

ముఖదీప్తి, సంధ్యాకాంతరీతి, మ్లానమైపోయింది
చిత్రాలకు రమ్మని పిలిచేవారే లేకపోయారు
సంపాదించిన సొమ్మంతా, నిర్వహణకోసం
చిత్రాలు తీయడంలో హరించింది
బంధువులు, తలాకాస్త్రా, కాజేశారు
వయస్సు మళ్ళింది, అదృష్టం వెనక్కు మళ్లింది
ఆరోగ్యం అంతమాత్రముగానే ఉండింది
మేడలు అమ్మింది, అప్పులు తీర్చింది
చిన్న అద్దెఇంటికి చేరింది, బంధువులంతా పరారు.

## 3

దేవతారాధనలు, ఉపవాసాలు, తిరుపతి యాత్రలు
పండని పొలాలయ్యాయి,
ఎండిన ఫలవృక్షాలయ్యాయి
చెల్లనినోట్లు, వసూలుకాని ప్రోనోట్లు అయ్యాయి
అంతచపల, చంచల లక్ష్మియని
ఎన్నడు అనుకొనలేదు
ఆశాసౌధాలన్నీ కూలాయి, స్వప్న తరణి మునిగింది
విలాసాలన్నీ పూలవలె వాడాయి,
వైభవాలు మాశాయి
మిగిలిందంతా, గడచిన కాలాల స్వీయచరిత్ర
నటనాకౌశల్యాల సన్నివేశాలు
అనుభవాల తియ్యనైన తలంపులు
చేసిన పొరపాటుల పశ్చాత్తాపాలు
జారవిడిచిన అవకాశాల వెక్కిరింతలు
అనుభవించిన వైభవాల స్మరణలు
ఏకాంతవాస సింహావలోకనాల మైలురాళ్ళుగ
కల్లలై, కలలు కట్టిన గూడులుగ
మూల ఒదిగిన స్వాగత పత్రాలు
శతదినాల మిమెంటోలు, ఫోటోల, ఆల్‌బమ్ములు
మూగగపడి, చూస్తూ వున్నాయి జీవితచక్రాన్ని,

హతాశయైన నటీమణిని,
ఒకనాటి అందాల రాణిని,
అందరికన్న మిన్నగ నుండిన అభిమాన తారను.
జీవితము
ఎండమావుల మైదానమని
ఇంద్రధనస్సుల ఆకాశమని
సాలెపురుగుల సన్నని గూడని
ఎన్నడును అనుకొని వుండలేదు
ఆమె.

గరివిడి, 26-9-77

## ప్రకృతి

ఆమె ముఖము
ముందు తెలుపు
వెనుక నలుపు.
అంత వ్యతిరేకముగ
వ్యత్యాసముగ
సృష్టి ఎందుకయ్యిందో!
జీవితమే
తెల్ల నల్ల గడుల
చదరంగ పలకయనీ చెప్పుటకా
పగలు రేయి
శుక్లపక్షము, బహుళపక్షము
ఎండాకాలం మబ్బులకాలం
ఏమిటది తెలుపు నలుపుల కలయిక
తిలతండుల సంయోగం
ఒకదానినొకటి వెంటాడి
పరుగిడుట?
ఏ తెలియరాని అర్థాన్ని
చూపే సూచనో!
పేక పడుగుల నేతబట్ట
ఏ నిజాన్ని మరుగు పరుస్తుందో!

## 2

వెలుగున్న చోటే నీడ
చీకట్లో నీడలేదు.
పౌర్ణానికే గ్రహణం.
ఇతర రాత్రులకు లేదు.
అమావాశ్య పగలే గ్రహణం.
ఇతర పగళ్లుకు పట్టదు.
ఏమీ యీ నియమాలు

ఏమీ యీ నిషేధాలు
ఏదో సత్యాన్ని మాయ
మరుగు చేసింది.
మాయను ఛేదించి
సత్యాన్ని చూచేదెట్లా?
సముద్రానికే ఆటు పోటులు
సరస్సుకు లేవు యీ హెచ్చుతగ్గులు
తుపాను ప్రెళ్ళగింతలు పెద్ద చెట్లకే
గడ్డిపోచలకు లేదు ప్రమాదం
మూగప్రకృతి ఏదో చెప్పబోతుంది
ఈ సత్యాల ద్వారా,
చె   లేక పోతుందో
అ  ము చేసుకోలేకపోతున్నామో!

## 3

అగ్నికి ఎప్పుడూ ఊర్ధ్వదృష్టే
నీళ్ళకి అధో దృష్టి
వాయువుకు సమదృష్టి కాబోలు
తలమీద విహరించే
అశ్విని భరణులకే అస్తమానం
ధ్రువనక్షత్రం అస్తమించదు.
పైనున్నవారే క్రింద పడడం
క్రింద నున్నవి సురక్షితంగా ఉంటాయి.
ముఖ్య మంత్రి మీదనే అవిశ్వాసం
ప్రతిపక్ష నాయకునిపై లేదు,
బ్రతికినవే చచ్చేది
చచ్చినవానికి చలనము లేదు
ఈ మూల సత సూత్రాలను
వ్యాఖ్యానించే పతంజలులు లేరా
ఈ శ్లోకాలకు దండాన్వయము చేస్తూ
అర్థం చెప్పే మల్లినాథులు లేరా

సుఖదుఃఖాలు
జీవన మరణాలు
ఉత్థాన పతనాలు
కలిసి వున్నాయని
చెప్తే చాలుతుందా
కృతి సౌంజ్ఞలను గుర్తించే
విజ్ఞులు కావాలె
ఆమె ముఖములోని తెల్లదనానికి
శిరోజాల నల్లదనానికి
వెనుక దాగిన మర్మాన్ని
తెలియచెప్పే మర్మజ్ఞులు రావాలె
అందాల వన్నెల కూడికను
మెచ్చుకొనే రసికులు కావాలె.

గరివిడి, 27-9-77

# ప్రేమ

ప్రేమ
కామం కాదు
పుట్టిస్తే పుట్టేది
ఆర్పేస్తే ఆరేది
కాదు ప్రేమ.
ఎందుకు పుట్టుతుందో
ఎక్కడ పుట్టుతుందో
తెలియని అగ్ని అది.
సౌందర్యానికి పడే తపన
[illegible]ష్ణ, అన్వేషణ.
ప్రేమలత
యౌవనం, దేహసౌందర్యాల
పాదిలో పుట్టి పెరుగుతుంది.
పుట్టి కొంత పెరిగాక
యౌవనం శిథిలమైనా
దేహసౌందర్యం క్షీణించినా
ప్రేమలత వాడిపోదు.
మొగ్గలు పువ్వులు
తొడుగుతునే వుంటుంది.
వృద్ధదంపతుల ప్రేమ అట్టిదే.
దేహ సౌందర్యానికి
అతీతమైన సౌందర్య సత్తాన్ని
కనుగొనవలెనని ఉత్సుక  డుతుంది.
స్పష్టముకాని తృష్ణతో
కలతపడుతుంటుంది.

## 2

ముక్కు ముఖముల
అందం కాదు

కన్ను చెంపల
అందం కాదు
వీని వెనుక
తొంగిచూచే
అలౌకిక సౌందర్యం
అది ఒక చూపులో
ఒక పలుకులో
ఒక ఒయా రంలో
విలాసములో
వ్యక్తం కావచ్చు.
అది నేను చూడవచ్చు
నీవు చూడకపోవచ్చు
ఇంకెవరు చూడకపోవచ్చు.
వాదానికి లొంగదది
వ్యాఖ్యానికి అందదది
నిర్వచనానికి పట్టదది
అందాలకు అందని
అందమది.
ఆత్మకు తెలిసే
మర్మమది.

## 3

సౌందర్యం ప్రేమను ఆకర్షిస్తుంది
అయస్కాంతమది
సౌందరా నలము
ప్రేమ లభాన్ని
బలికోరుతుంది.
ప్రేమ కోరేది
సౌందర్యప్రాప్తిని మాత్రమేకాదు,
అంతస్వా ం కాదది
ఇంకా ఎక్కువ క రుతుంది

సౌందర్యం పొందడం
తన కోరికే అవుతుంది.
సొంత పరిధిలోనే
తిరుగుతుంటుంది.
సౌందర్య సృష్టిని
కోరుతుంది ప్రేమ.
ఉన్న సౌందర్యం చాలదు
ఇంకా సౌందర్యాలు కావాలె
పెంచేది పెరిగేది సృష్టి
ఒకటి పదయ్యేదే సృష్టి
భవిష్యత్తుకు ప్రాకేది సృష్టి
అందుకు ఒక సోపానము చాలదు.
సోపాన పరంపర కావాలె
నిచ్చెనకు మెట్లు పెక్కు కావాలె
ఒకటి తర్వాత, ఇంకొకటి రావాలె
తాత, తండ్రి, కొడుకు, మనమడు
అది ఒక పరంపర.
చెట్టు, కాయ, గింజ
అది ఒక పరంపర.
పక్షి, గుడ్డు, పిల్ల అంతే.

## 4

ఒకటిలో సృష్టిలేదు
'అద్వైతం'లో సృష్టిలేదు
'ద్వైతం' కావాలె.
కనీసం రెండు కావాలె
మగ ఆడ కావాలె.
రెండు మగలలో సృష్టిలేదు.
రెండు ఆడలలో సృష్టిలేదు.
మగ ఆడల ద్వైతం కావాలె
దాన్నే పురుషుడు ప్రకృతి అన్నారు.

పశువుల్లో, పక్షుల్లో, చెట్లల్లో
మగ ఆడ భేదాలున్నాయి
ప్రేమ
సౌందర్యాన్ని, సృష్టిని, విస్తరణను
పారంపర్య క్రమణికను
కోరుతుంది.
అదే దాంపత్యం
దంపతులకు
అన్యోన్య సౌందర ం చాలదు.
ష్టి కావాలె
అదే ంతానేచ్ఛ.
అది లేకుంటే
ప్రేమకు కొరత.
అమర పు బీజాలను
మానవ శరీరాలలో
నాటుతుంది ప్రేమ.
అదే సంతానం.
మరలా, సంతానానికి సంతానము.
అదే ష్టి పరంపర.
సష్టి, పరంప ను దాటలేదు
వరుసగ రావలె
తాతకు మనుమడు పుట్టడు
తాత, తండ్రి, కొడుకు, మనుమడు
ఆ వరుసలోనే రావాలె.
ప్రేమ అపేక్షిస్తుంది
సౌందర్యము ద్వారా
సృష్టి పరంపరను.
అదే గృహస్థాశ్రమము.

నెల్లూరు, 8-7-77

## పాప

పాప పుట్టిన పండుగ
సంవత్సరమైంది చేతిలోకొచ్చి
కొద్దిగ గుర్తు పట్టుతుంది
తల్లిదండ్రులను, ఎత్తుకొనేవాళ్ళను.
అర్థంలేని నవ్వుల నవ్వుతుంది
లేనికీర్తనకు భజన చేస్తుంది
దండం పెట్టుతుంది, చేతిని కలుపుతుంది
అందరికీ గారాబం
అందరి వాత్సల్యాన్ని పొందింది.

## 2

బంధువుల కందరికి ఆనందాల పంట
ప్రేమలో అంతర్లీనమైన సౌందర్య సృష్టి
అనురక్తి కావ్యంపు శ్రీకారము
దాంపత్య స్వప్నాలు గీచిన ప్రథమ చిత్రం
ఆకాంక్షలత తొడగిన తొలికిసలయం
అనురాగ కల్పన ఆదిశ్లోక పాదం
పూజపల్లవిలో తొలి నుడికారము
ప్రమోదవనమున కోమలాంకురమై
పుట్టింది.
పాలకడలిలో కాన్పించిన ప్రథమ ఉషస్సు రీతి
అనుక్షణము పెరుగుతు వచ్చింది
ఉదయ గగన ముఖాన మెరిసే
శుక్రతారవలె నవ్వింది
సంసార సాగరతలమున
అమృతవర్షం కురిసింది.
విదియచంద్రుని కళారేఖవలె వెలిగింది
ఇంటినిండా వెలుగును నింపుచు
బాలార్కుని కిరణమై దీప్తించింది
అనురాగ సుఖములకు సువాసనై అబ్బింది

శిశుక్రందనలే ఆనందమూల సంపద అయ్యింది.
చిన్ని నీటిబుగ్గవలె,
హాసధారలతో ఇళ్ళంతా పరిచింది.
ఏకిన దూదిపింజమువలె
తెల్లనైన అందపు అంగాలు.
శిరీష పుష్పమువలె
మెత్తని నునువగు దేహము.
తొలి వత్సరపు వత్తి వెలుగును ఊదింది.
జీవన పఠన కార్యక్రమములో
అ ఆ లను దాటి ఇ ఈ లకు వచ్చింది
ప్రతిమాసము కన్పించే పెంపులతో పెరిగింది
బంధువులందరికీ నయనజ్యోతి అయింది.
అందరు దీవనలిచ్చారు, బుగ్గల ముద్దిడుచు
వెయ్యేళ్ళు సుఖముగ బ్రతకాలె
ఏడుకు వెయ్యినాళ్ళు వుండాలె.
అమృత బిందువుగ
కాంతి రేఖగ
అలరించే శిశువును కన్న
అమ్మ నాయనలను
అభినందించారు
నిండు హృదయంతో

నెల్లూరు, 2-9-77

## హృదయవనం

యౌవన వసంతావిర్భావాన
ఆమె హృదయ వనాన
ఎన్నెన్ని భావలతికలు
పుట్టి పుష్పించెనో లెక్కలేదు.
కొన్ని పెదవుల పందిరిలో
కుసుమ కోరకములుగ
అర్థస్ఫుట ముకుళములుగ
పూర్ణ ప్రఫుల్ల ప్రసూనములుగ
తొంగిచూస్తూండినాయి.
దక్షిణ సమీరాల లాలింపులతో
అవి నటిస్తుండినాయి.
పల్లవములపై సన్నజాజులు
మల్లెపువ్వులు,
చంపక పుష్పాలు కన్పించాయి.
మరికొన్ని ఎగబ్రాకి
నయనకోణాలలో గుబాళిస్తున్నాయి.
మిలమిల మెరుస్తున్నాయి,
మాటలులేని పిలుపులతో నవ్వుచున్నాయి.

నెల్లూరు, 27-8-77

## లత

పెరటిలో సన్నచెట్టు బాగా పెరిగింది
చిరుగాలి వీవనకు చేతులు ఊపుచు ఆడేది.
ప్రభాత పక్షుల కూజితాల తల ఊపుచు వినేది.
సంధ్యారాగాన్ని ప్రతిబింబిస్తూ మెరిసేది.
ఎండలో వానలో, తపస్సుచేసే
మునికుమారునివలె ఉండేది
వెన్నెలలో అప్సరసవలె,
చీకట్లో ప్రేతమువలె వుండేది
ఆరుఋతువులకు హారతిపడుతు బాగా ఎదిగింది.
ప్రక్కనే చిన్నతీగె మొక్క మొలిచింది
చిన్నిఆకులు, సన్నకాడలతో పెరిగింది
కాడల చేతుల చాపుచు, చెట్టును చూచేది.
దోగాడుచు మెల్లమెల్లగ చెట్టును చెరింది.
తీగ బిడ్డను చూస్తూ,
చెట్టు అనురాగపు నవ్వుల నవ్వింది
తల ఊపుచు ఊపుచు దగ్గర రమ్మని పిలిచింది
తీగె వైపుననే మొగము త్రిప్పి ప్రేమతో చూచింది.
తే ఎండ వేడిమిలో చీకట్లమంచులలో
స్నేహం కుదిరింది
పాదాలకు ముద్దుపెట్టి, మోకాళ్ళను పట్టింది
కొమ్మల చేతులచేరి, లాలింపుల పొందింది
చెట్టు ఆకుల కదపుచు,
బులిబులి మాటల పలికింది
అనురాగముతో లత తనువును,
నిమురుచు ఎత్తింది.
భుజాల చేర్చి ఊపుచు ఎగురుచు ఆడింది
తీగె మెత్తని ఒంటిని నిమురుచు అలరింది
ఏకాంతములో తియ్యని నెయ్యం దొరికింది
చిరుగాలిలో ఇద్దరు ఊగుచు ఆడారు.

వానలలో తడుస్తూ, నగ్నంగా స్నానం చేశారు
వెన్నెల గాలిలో గుసగుసలాడుచు నవ్వారు
చీకట్ల అందముల ఆనందిస్తూ
మిణుగురలను పిలిచారు
మిణుగురు వెలుగులు
చిరునవ్వు మొలకలయ్యాయి

## 2

ఆ మనికాలం వచ్చింది
మందమారుతాలు చుట్టాలవలె వచ్చాయి
మామిడి పూతల పరిమళాలు హాయిని కూర్చాయి
చిగురుటాకులు మొగ్గలు పండుగ చేశాయి.
లత పుష్టిని పొందింది, చేతులు బలిశాయి
దేహము పెరిగి, బరువును పొందింది
లాలించి పాలించిన తరువును క్రమ్మింది
బిగికౌగిటిలో చెట్టును అదుముచు వచ్చింది
సడలని ప ుులో, ప్రేమబంధిని చేసింది
తల ఎత్తు , నాలుగువైపుల ఆవరించింది
నానాటికీ భారము మెండై, చెట్టు బాగా వంగింది
ఊపిరి సలుపక గిజగిజలాడింది
లతకు ప్రణయం తరువుకు ప్రళయమైపోయింది
ఈ ప్రళయ ప్రణయ మెన్నాళ్ళు?
విరామ మెరుగని పరిరంభణ ఎన్నాళ్ళు?
ఊపిరాడిని వలపుటురి ఎన్నాళ్ళు?
చెట్టుకు శ శాన శృంగారమయ్యింది
చితాభస్మ...ల మృత్యుతాండవమయ్యింది
చితాగ్నుల సాక్షిగ, వారిద్దరి పెండ్లి జరిగింది

## 3

పణయపరాజితుడు పెండ్లికుమారుడు
ప్రేమవ్యూహములో బంధి, మరణసంసిద్ధుడు
పెండ్లికుమారుడు

ప్రణయదుర్గముపై మరణపతాకను నాటింది
పెండ్లికూతురు
మృత్యుశంఖము పూరించి, అట్టహాసమున నవ్వింది
భూతలశయనుడు ప్రేమబలియైన
భర్తశవముపై చావుచిందుల ఆడింది
పెండ్లికూతురు
ఇదేమిన్యాయము, ఇదెట్టి బలాత్కారము
ఆశ్రయమిచ్చినవానికి, ఇదేనా బహూకరణ?
అని అడుగ పెండ్లికూతురు జవాబిచ్చింది
అది అంతే, ఎవరి ఆనందము వారిదే
పర కష సుఖాలకు తావులేదు.
అంతా సా  ం, స్వా  సంచయం ఆనందము
లో  ళా ణము ఋషులకే, రాజులకే
నాకు వే  లోకంలేదు నా లోకం తప్ప
అనంతరాగం విస్తరిల్లి
అలతి పలుకుల అణచుటలేదా?
ఇసుకదిబ్బల చిన్నకాల్వల పూడ్చుటలేదా
తుపానుగాలులు అడవుల ధ్వంసపరచుటలేదా?
కొండచిలువలు జింకలచుట్టి చంపుటలేదా?
నదీజలాలు పంటపొలాలను ముంచుటలేదా?
వేటకాడు సింహశార్దూలముల వధించుటలేదా?
ఇదంతా లోకకళ్యాణము కాదుకదా
నా వలపువేట అంతే అందు దయాపద్ధతి లేదు
శృంగారములో కారుణ్యం లేదు.
బలహీనుడు భర్త నా కౌగిట మరణించాడు,
బలవంతుల కౌగిటిలో నేను చచ్చుటకు సంసిద్ధం
అన్నది పెండ్లికూతురు వెటకారంగా నవ్వుతు.
ఇదే 'నా సమర్ధులకే జీవన విజయం' అనుకొంటూ
దీపము ఆర్పాను.

నెల్లూరు, 26-7-77

మడుగు

పవాహమే నదికి
అందముల ఇస్తుంది
ప్రవహించే నది
స్వచ్ఛంగా వుంటుంది
నదికి కళ్లు కాళ్ళు ఉంటాయి
చూస్తూ నడుస్తూ పోతుంది
కొండల నుండి కడలిదాకా
చాలదూరము జరజర పోతుంది
పర్వతశిఖరాల నిశ్శబ్దతకు
సముద్రతరంగాల ఢమరులకు
చెలిమికూర్చి ఆనంద నృత్యం చేస్తుంది
పంటపొలాలకు నీళ్ళను ఇచ్చి
సిరిసంపదల పుట్టిస్తుంది.
నదుల గట్టులనే
లక్ష్మి సరస్వతుల బాలవిహారం
అన్నపూర్ణకూడ చేరుతుంది ఆ క్రీడలలో
కళకళలాడుచు, అంతా పచ్చగ ఉంటుంది

2

ప్రవాహాన్ని పోగొట్టుకుంటే
నది నదిగా వుండదు
చెరువౌతుంది మడుగౌతుంది
మడుగైనపుడు
కాళ్ళు చేతులు లేక
జలకళేబరమౌతుంది
కళేబరమంతా కన్నై
ఒక కంటివాని వలె చూస్తుంది
గిరుల మాట సింధువు మాట
గత జన్మస్వప్నములాగా చూస్తుంది.
కల్మషమంతా చేరి

బురదలు కాపురాలు చేస్తాయి
నత్తలు జలగలు విడిదికి వస్తాయి
బర్రెలుచేరి జలమునుల వలె ఉంటాయి
శైవాల లతలు నిండుగసాగి విస్తరిల్లుతాయి
జలదేవతల మలినవస్త్రాలవలె తేల్తాయి

**3**

జన సమాజము అంతే
ఆదర్శముతో ఉత్తేజముతో
నడుస్తుపోతుందా, నది ఔతుంది
భావికాలపు కడలి పిలుపును
వింటూ ముందుకు పోతుందా
నది ఔతుంది
వెనక చూపుల చూస్తూ
తాతల గొప్పల నెమరువేస్తూ వుంటే
మడుగౌతుంది
పాతకాలపు ఆచారాలను
గుడ్డినమ్మకాలను విడువకపోతే
శైవాలదామ శ ంఖలాలతో
పంకపూర్ణమై, దుర్గంధపూరితమైన
మడుగౌతుంది

నెల్లూరు, 27-7-77

## డొంక

అందరూ నడిచే డొంక
సంతకు పొయ్యేవాళ్లు
సరకులతో వచ్చేవాళ్లు
బావినీళ్ళకు వెళ్ళేవాళ్లు
బడి పిల్లలు, అందరూ
నడిచే డొంక
చిన్నప టి నుండి చూస్తుండిన డొంక
ఎండల్ల వానల్లో అందరికీ ఎరుకైనదే
చీకట్లో కూడ అ ష్టంగా కనబడుతుండేది
రాకపోకల సంబ ంలో
మొక్కలు గడ్డి మొలిచేవి కావు
తీగెలు అల్లుకొనేవి కావు
ఏ అడ్డులు లేకుండా వెళ్ళేవారు
నిర్భయంగా తిరిగి వచ్చేవారు

## 2

పంచాయతీ సమితి వారు
మరొకచోట రోడ్డును వేశారు
క్రొత్తత్రోవనే అందరు
వె తు వచ్చారు
సం త్సరముకాగా
కుతూహలము కొద్దీ
డొంక ఏమైందో చూడ్డానికి వెళ్ళాను
రాజ్యముపోయిన రాజురీతి
దివాలా తీసిన ఆసామి వలె
పదవిపోయిన నాయకుని భంగి
పాడువడిన దేవాలయము మాడ్కి
రేగిన తలజుట్టు వలె
ఓడిన సైన్యమువలె
గజిబిజిగా వుండింది డొంకంతా

ఏదో నిరాశ అలమి వుండింది
పలకరించేవాళ్లు లేరని దిగులు చెందింది
గడ్డిమొక్కలు తీగెలు అంతా వ్యాపించాయి
లాలిస్తూ పాలిస్తూ వుండిన
కాలి అడుగులు కరవాయె
శ్రావ్యంగా వినిపిస్తుండినమాటలు నవ్వులు లేవాయె
మత్తే భయానల పాదపద్మములు లేవాయె
కాళ్ళమెట్టియలు, కాలి అందెయలుకరవాయె
ఒంటరి తనములో విరహిణివలె
నిట్టూర్పుల విడిచింది
దిక్కులేని అనాధవలె దుఃఖించింది
డొంకకు కావలిసింది నడకలు
రాకపోకలు, జనసమ్మర్ధం
కదలిక కావాలె, చలనము కావాలె
అవి లేనపుడు, మొక్కలు ముళ్లు చేరాయి
చలనములేని సంఘం కూడ అంతే

నెల్లూరు, 28-7-77

# మాతృ పూజ

వకుళవృక్షము రాలుస్తున్నది పువ్వులను రాత్రంతా
శ్యామమేఘాలు జలబిందువులను వలె
పుడమి తల్లి చెవులో ఏ గుసగుసల పలుకుతుందో
పరిమళ అనురాగవార్తలను అందిస్తుందో
జనని పులకిత గాత్రయై హర్షమును చూస్తున్నది
వకుళవృక్షము ప్రేమపూరకముగ
మాతృపీఠమున సురభిళ  వ్యముల అర్పిస్తుంది
ఇదెట్టి మాతృపూజో
సాంబ్రాణి గుళికలతో అర్పిస్తుంది
పువ్వు ముత్యాల సరాలను తల్లిమెడలో వేస్తుంది
ఏ అజ్ఞాత ఆనంద మందహాస సంకేతాలో
ఈ ప్రసూన సుగంధబిందువులు
శకుంత కలరావాలను
సువాసన సుమనాలుగ తీర్చుకొన్నది కాబోలు
జ్యోతిరింగణాల మినుకుల
సౌరభ కణాలుగ మార్చుకొన్నది కాబోలు

**2**

గగన రాజ దూతయై వృక్షము
భువనము కు ఏ ప్రేమ సందేశము పంపిస్తుందో
భూరుహము భూమికి చేయు
ర్వరజతాభిషేకమా
క్షత్రాలు గగనవృక్షాన మెరసినట్లు
పువ్వు చుక్కలు పుడమిని ముగ్గులతో
సోకు చేయుచున్నవా
అనురాగ సందేశాన్ని ప్రేమవార్తను
ఈ పుష్పాలు ధరణికి తెచ్చాయి,
వ్యాకులతను, వైకల్యాలను పాన్ప,
అరుదెంచిన సాంత్వన సుమనాలా
ఈ సుగంధ గర్భిత గుళికలు

## ౩

దూరానికి పరిమళాల పంపకపోయినా
చాలకాలము సువాసన కొసే పూలవి
అంతదీర్ఘకాలము సుగంధముతో నున్న పుష్పాలు
మరి వేరే లేవో
వాడినా సువాసన కడుపున దాచిన పూలవి
పొగడ పువ్వుల సరాలు
అనురాగ పరిమళాల
పదిలము చేసిన గుండె తునకలవి

నెల్లూరు, 10-11-77

# మార్పు

అన్ని దిక్కుల కిటికీలు తెరవాలె
క్రొత్త తలపుల గాలులు దూరాలె
కాపురంచేసే ఇల్లు మారుతు వుంటుంది
పిల్లలు పెరుగుతు వుంటారు
అమ్మాయిలు పెండ్లాడి అత్తవారిండ్ల చేర్తారు
అబ్బాయిలు పెండ్లాడి కోడళ్ళను తెస్తారు
పెద్దాయన మరణించి
సజీవ స్మృతి స్థంభముగా
భార్యను విధవనుచేసి పోతాడు
సమాధికి లేదు మార్పు
సజీవత్వానికి సంకేతము మార్పు
జడత్వానికి లేదు మార్పు
మనిషి ఎంత మార్తాడు ఏభైయేళ్లల్లో

2

మన అంగీకారముతోనే మార్పులు వచ్చాయి
కొలదిమంది ఆహ్వానముమీదనే వచ్చాయి
పెక్కుమంది ఆమోదము మీదనే నిలిచాయి
నన్నయకాలం భాషే కావాలా
ఆయన వాడిన మిశ్రసమాసాలే వాడాలా
అవి దృష్టాంతాలు కావా
అట్టివి వాడండని దారి చూపలా
పండితులు అవి మాత్రమె గ్రాహ్యములన్నారు
భాషను పెరగకుండా చేశారు
వ్రాయడం పండితులకు మాత్రమె
సాధ్యం అయ్యింది.
తిక్కన్న పెద్దన్నలలో కూడ
వ్యాకరణ దోషా లున్నాయని
గిడుగువారు రుజువు చేయతే
అవి, దోషాలని ఎందుకనుకోవాలె

మార్గమునుచూపే సూచనలు కావొచ్చే
ఆ మార్గమున నడవడానికి మనకు భయం
చిన్నయ్య వ్యాకరణం ఒప్పదని సందేహం
భాషాప్రవాహానికి డాముల కట్టారా
కాలువలులేని డాములవి
అందుకే నిషేధాజ్ఞల ఉల్లంఘించి
ఉబికి పొర్లి జలపాతాలయ్యాయి

3

జనుల కొరకు భాష
జనులు పెరిగే కొద్దీ
భాష కూడ పెరుగుతుంది
సమాజపు ఆవశ్యకతలనుబట్టి
భాషను మలచుకోవాలె
విద్వత్ గిరులను వదలి గంగ దిగింది
జనపదములకు తరలింది
క్షేత్రాలను సస్యశ్యామలం చేసింది
పుట్టించిన పరత్వాలు
దాని గమనాన్ని ఆపలేవు
జనులను అభిషేకం చేసింది
వారి నిమిత్తాలె భాషకు బలం
వారి ఆశీర్వాదం పొందింది
పండితభాష ప్రజాభాషగ పెరిగింది
వామనరూపం త్రివిక్రమరూపం తాల్చింది
నూరు రేకుల విప్పి
తామరపువ్వు పూచింది
నూరు ఈకల విప్పి
నెమలి నాట్యం చేసింది
ముడుచుకుపోయిన భాష
జనశక్తిచే సాగింది
హేమంత శిశిరాలు పోయాయి

పలువన్నెల వసంతం వచ్చింది
బీజాలు అంకురాలయ్యాయి
అంకురాలు వ కొలయ్యాయి
వృక్షాలు మొ లు తొడిగాయి
మొగ్గలు కన్నుల తెరిచాయి
మూగకోకిల తియ్యగ పాడింది
నవజీవన స్పందనం
ప్రతిహృదయాన్ని ఊపింది

4

వచనం సాహిత్యం కాదని
మొన్నటిదాకా అన్నారు.
వృత్తాలతో పెద్దసమాసాలతో
పద్యకావ్యాలు వ్రాశారు
అమరం ని కఠిన పదాలను వాడారు
శ్లేష, ధ్వని, వ్యంగ్యమని
భాషకు మోయలేని సొమ్ముల పెట్టారు
కఠిన సూ ల్లో పడివుండింది భాష
అదంతా ... టికి ఒకరు చదివిన కాలం
ఆ చదువుకొన్నవారిలో నూటికి ఒకరు
కావ్యాలను చదివే కాలం
అదేనా భాషా ప్రయోజనం?
ఈ నాడు చదివినవారు అధికమయ్యారు
వారిలో చాలమందికి కావాలె
అర్థమయ్యే సాహిత్యం
వారు అందుకొనే భాషలో
ఈ శతాబ్దపు సాహిత్యనందనవనంలో
శాఖోప శాఖలు పెరిగాయి.
క్రొత్త క్రొత్త రంగులతో పువ్వులు పూచాయి
క్రొత్తక్రొత్త వాసనలు వ్యాపించాయి
క్రొత్త రుచులు, క్రొత్త తీపులు

చవిచూస్తున్నారు ప్రజావళి
క్రొత్తశక్తి క్రొత్తవెలుగు
జవశక్తి, జీవనశక్తి, జనశక్తి
సంగమించి రూపొందుతున్నాయి
ఇదంతా పతనమేనా? కాదు
గంగా పతనములోనే
అమేయమైన విద్యుత్‌శక్తి ప్రభవిస్తుంది
జీర్ణ పత్రపతనములోనే
నూతన కిసలయ అరుణిమలు
పశ్చిమాద్రి సూర్యపతనముతోనే
అగణితములగు నక్షత్రాలు
జ్యోత్స్నా విహ్వల యామినులు
అభ్యుదయ యుగమిది
నడిచిన త్రోవనే నడిచే కాలం కాదిది
క్రొత్తమార్గాలను, వెలుగు బాటలను
చక్కని రస్తాలను వేసుకొనే కాలమిది

**5**

రా, మార్పుకు స్వాగతం పలుకు
దాని రాకకు హారతి పట్టు
అందరుతోడుకొనే బావినీళ్ళతోనే
దాన్ని అభిషేకించు.
దాన్ని నీదాన్నిగ చేసుకో
స్వీకరించు, అది పతితకాదు
నవోజ్వలమైన కన్య
బాల, ముగ్ధ, సరళ, సరస.

మద్రాసు, 4-7-77

# నా జన్మ దినం

రేపు నా జన్మదినం
డెభ్భైఏడులు నిండాయి
ఈ కాలంలో విషయాలు
చాల జరిగాయి
దేశంలో సమాజములో
సాహిత్యంలో విజ్ఞానంలో
ప్రగతి బాగా జరిగింది
ఇరవయో శతాబ్దం
ప్రపంచ ఎరిణామాల్లో
ప్రాశస్త్యాన్ని పొందింది
అణువును చీల్చి
ప్రళయాగ్నుల సృష్టించారు
వ్యోమయానం చేస్తూ
భూప్రదక్షిణల చేశారు
చంద్రమండలమే చేరారు.
విశ్వంలోని దేశాలన్ని
స్వాతంత్ర్యాన్ని పొందాయి
కలిమిదేశాలు
లేమిదేశాలతో
చేతులు కలిపాయి
అడుగున పారే
నదీ జలాలను
కట్టల ద్వారా
పైకి తెచ్చి పారిచ్చారు,
లక్షల వత్సరాలుగా
భూగర్భంలో శయనిస్తున్న
వసులక్ష్మిని లేపి పైకి తెచ్చారు
సంఘంలోని హెచ్చుతగ్గులను
తగ్గిస్తున్నారు

తాత ముత్తాతలు
ఊహించని ఉన్నతిని
చూస్తున్నాము, అనుభవిస్తున్నాము
తలపెట్టని మార్పుల
అంగీకరిస్తున్నాము
శాస్త్రాల పట్టులు
చాలవరకు సడలాయి
క్రొత్త టీకలకు లొంగాయి
వ్యక్తి అధికారాలు
వికసిస్తున్నాయి
ఇరవైఒకటో శతాబ్దములో
రాబోయే పెద్ద మార్పుల రాకకు
రత్న ంబళ్లను పరుస్తున్నాము
ఈ శతాబ్ద మృణాళముపై
పై శతాబ్దకమలము
క్రొత్త తావులతో, క్రొత్త రంగులతో
రెక్కలు విప్పుతుంది
స్తబ్ధత నొందిన శతాబ్దాలు
చకితములై లేస్తున్నాయి
విస్మయముతో విహరిస్తున్నాయి
నా జన్మదినాన
భావికాలపు ఆహ్వానాన్నె
మంద్రస్థాయిలో వింటున్నాను.
స్వర్ణరూపాన్ని, దిగంతయవనికమీద
అస్పష్టచిత్రంగా చూస్తున్నాను.
నేనుండని ఆ శతాబ్దములో
ఊహాకాయముతో కాలిడుచున్నాను
ఆ శతాబ్దపు రాకకు
నా ఆకాంక్షా తోరణాలతో
స్వప్నాల ద్వారాలతో

స్వాగతమిస్తూ
అదృశ్య హస్తాలతో
మంగళహారతి పడుతున్నాను.
స్మృతిరైమె ప్రేమిస్తున్నాను.
నిన్నలలో చేరి ఆ రేపులకు
స్వస్తివచనముల పఠిస్తున్నాను
సప్తదశాబ్ది
శిఖరాన్ని ఎక్కి
వెనుక నున్న దృశ్యాలను
స్మరణ నయనాలతో
తిలకిస్తున్నాను
ఉదంతాల ఘోషలను
అలుగుచున్న ప్రతిధ్వనులుగ
సన్నగ వింటున్నాను
ఆనంద విషాదాలతో
నేసి మడతపెట్టిన
వస్త్రమును చూస్తున్నాను.
జయాపజయములతో
ఆశానిరాశలతో
పొదిగిన నా యుగపు జీవిత కిరీటాన్ని
చూస్తూ విస్మితుడయ్యాను
ఆ నందనవన శాఖలలో
పుష్పాలు చివుళ్లు పండుగలేనా
పండిన ఆకులు, ఎండిన రెమ్మలు
పాతతలంపుల కాలిజాడలగువా?
గతకాలపు నికుంజాలలో
పికశారికలే కూస్తున్నాయా
కాకులు గూబలు అరుచుటలేదా?
అంతా అనురాగమేనా
అంతా ప్రేమేనా, త్యాగమేనా?

ద్వేషాలు, ఈర్ష్యలు
కోపాలు, స్వార్థాలు
జీవనలతలో ననలెత్తలేదా?
నవరసాల సంగమం
సప్తస్వరాల మేళనం
షడుచుల మిళితం
మా వ జీవన ప్రకృతి
పంచేంద్రియాలకు అతీతులై
నిస్వార్థంగా బ్రతికేవారు
ప్రేమసత్యములతో నడిచేవారు
మానవాతీతులు, పురుషోత్తములు
దైవాంశ సంభూతులు
అట్టివారిని ´ రించుకొని
హృదయాన్ని పావ ం చేసికొని
చేయెత్తి దండం పెట్టాలని
అనిపిస్తున్నదీ నాడు
మహామానవుల ఆదర్శజీవితాలే
నన్ను నడపాలెనని
కోరుకొంటున్నాను

నెల్లూరు, 4-8-77

# సాహిత్య అకాడమీ

ఇరవైయేళ్ల ఇతిహాసంతో
భాషారథాన్ని భవిష్యత్తుకు తోలింది.
పండిత హిమాద్రుల వదలి
భాషాగంగ జనపదకందరాలకు వచ్చింది
లోకుల ముఖాల నుండే
శక్తిని బలాన్ని పొందింది
అనాదృతమైయుండిన వచనము
సాహిత్యరూపం తాల్చింది
స్తంభించి చలనములేని భాష
పలుదిక్కుల పరువెత్తింది
మాండలికాలు, రైతుల కూలీల మాటలు
సాహిత్యంలో ఉచితస్థానాన్ని పొందాయి
భాషకు నవచైతనం వచ్చింది
హరిజనులు, క్రైస్తవులు, ముస్లింలు
రైతులు, మహిళామణులు
వ్రాస్తున్నారు పద్యాలు గద్యాలు.
అందరూ వ్రాస్తు, చదువుతుంటేనే
భాషకు ప్రయోజనం, ఆనందం.
భావముతో సాహిత్యం
వ్యాఖ్యానముతో సాహిత్యం
సరళమైన భాషలో రావాలె
కొత్త ఊహలతో, క్రొత్తశైలితో
పద్యాలు వచనాలు నడవాలె
క్రొత్త పరిస్థితులు, క్రొత్త వాతావరణం
అన్నిటినీ ప్రతిబింబించాలె సాహిత్యం.
సాహిత్య వనానికి క్రొత్త వసంతం వచ్చింది
పండిన ఆకులు, వాడిన రెమ్మలు పోవాలె
చిగురులతో చిరుమొగ్గలతో కళకళ లాడాలె.
నవరాగాలను పంచమస్వరమున పాడాలె

నవవేణువీణలను పలికించాలె
కవితా విహంగాలు ఆకాశములో ఎగరాలె
నెమలివలె కోడివలె కాకివలె ఎగిరితే చాలదు
కపోతమువలె, డేగవలె, గరుత్మంతునివలె
మబ్బుల ఎదపై విహరించాలె
దూరదృష్టితో, సూక్ష్మదృష్టితో, ఊర్ధ్వదృష్టితో
చూస్తూ ఔచిత్యపు నీడమును గమనిస్తు ఉండాలె.
అందరికీ హితకరమైన సుఖప్రదమైన
సాహిత్యం విరివిగ రావాలె
శాఖోపశాఖలతో సాహిత్యతరువు పెరగాలె
లోపలపుచ్చు బయట తుపాను
రాకుండ అందరు చూడాలె
అకాడమీ, మూసీతీరాన పూచిన ప్రసూనం.
దాని సౌరభసందేశాలు చేరాలె
వంశధార, గోదావరి,
కృష్ణ పెన్న తుంగ భద్ర తీరాలు.
అన్ని నదుల జలాలతో అభిషిక్తం కావాలె
అకాడమీ
అఖిలాంధ్ర సాహిత్య మూలధనం కావాలె అకాడమీ

నెల్లూరు, 14-8-77

# తిక్కయజ్వ

తిక్కయజ్వ రచించిపోయె
హరి హరనాథ తత్వము
ఏడు శతాబ్దాలుగ ఉన్నాయి
ఆశ్వాసాంత పద్యాలుగ
భారతకథకు సంబంధము లేనివి
సంస్కృత మూలములో లేనట్టివి
టూకీగా టిప్పణము చేశారేగాని
లోతుకు దిగి తత్వవిచారము చేయకపోయిరి
సంస్కృత భూయిష్ఠమైనవి
పరతత్వ సంబోధ లైనవి
గమనించకపోయిరి నిగూఢముగ
భయపడిరి సమాససర్పాలను చూచి
క్లిష్టమైన వేదాంత రహస్యాల చూచి
వల్మీకములో ఉండదగినవని
వదలివేసిరి విడ్డూరముగ
శాపగ్రస్త అహల్యవలె
అర్ధజాగరణ స్థితిలో ఉన్నాయి
మేలిముసుగుల సడలింపని
యవనయువతులవలె ఉన్నాయి
సౌరభము ప్రసరించని సుమములై ఉన్నాయి
మేఘావృతమైన ప్రొద్దుటి పూట
భాను బింబమువలె ఉన్నాయి
కలలో కనబడి మాయమయ్యే
సుందరమూర్తులుగ ఉన్నాయి
దప్పిక తీర్చని ఎండమావులవలె ఉన్నాయి
లొంగని శత్రుసైన్యముల వలె
ఆచరణకు లొంగని ఆదర్శములవలె
చదవరాని జిలుగు వ్రాతవలె
అర్థముకాని అంతరంగ వేదనవలె ఉన్నాయి

## 2

అంతేనా వాని విధి
నిరంతర శబ్దశయనమేనా వాని తలవ్రాత
శాపమునకు విరుగుడు లేదా
విశ్వామిత్రుని తోడి
రామచంద్రుడు వచ్చుట లేదా
ముసుగును సడలించే
వరహస్తాలే కరవాయెనా
మేల్కొలిపే పాటలు పాడే
వైతాళికులే లోపించారా
అని ప్రశ్నిస్తూ తిరుగుతు వచ్చాడు
అన్వేషణ చాలకాలం జరిగింది
నిరీక్షణ మాత్రం మిగిలింది
అన్వేషణఫలం ప్రాప్తం కాలేదు
మరొకరైతే, విసుగున వదలేవారు
కాని సాహిత్య పిపాసికి
ఏదో అజ్ఞాత అంతర తృష్ణ
వేధిస్తూనే ఉండింది

## 3

కావ్యక్రతువును సాధించే
సోమయాజి దొరికాడు
వారిని రావించి, బహూకరించి
యజ్ఞమును ఆరంభింపమని
వేడుకొన్నాడు వినయముగ
క్రతువు మొదలిడగా
బయటికి వచ్చెను ఒకటొకటిగ
వేదాంత రహస్యాలు సుస్పష్టంగా
పరతత్వపు గుణరూప విశేషాలు
వేద, ఉపనిషత్తుల పురాణాల
ప్రమాణాలతోడి లేచాయి

సానబెట్టిన రత్నాలవలె మెరిసాయి
కరిగిన బంగారువలె వెలిగాయి

## 4

దుర్భేద్యమైన సాహిత్య దుర్గాలు
కైవసమైనవి అదూరకాలములోనే
గనిలో అణగిన వసువులు
కదలి వచ్చెను వెలుగులోనికి,
మునిమాపువేళ ఇల్లు వెడలిన
అభిసారికల రీతి.
శబ్దప్రాసాదాలు
సువర్ణకవాటాలు తెరచాయి
మూగగయుండిన వీణాతంత్రులు
మధురరాగాలు పాడాయి
వేణుగానమున
దీర్ఘ సుషుప్తిత భుజంగాలు
పడగలవిప్పి లేచాయి.
శబ్దమయూరాలు
వా ఖ్యాపింఛల విప్పి ఆడాయి
స..ానపాషాణాలు
హిమశిలల వలె కరిగాయి
కరిగి మందాకినివలె పారింది
శివ జటాజూటము నుండి
గంగక్రిందికి ప్రసరించింది
విష్ణుకౌస్తుభమణివలె
స్వర్ణప్రదానము చేసింది
పరతత్త్వము భద్రాయిత మూర్తియై
హరిహరనాథ రూపమై
శ్రీగౌరీ సమేతమై
యమునా గంగల సంగమమై
సాహిత్యప్రయాగగ వెలిసింది.

*బాలకృష్ణులు నీలకంఠులు
సతీర్థులయ్యారు
కావ్యక్రతువు ముగిసింది
హరివేరు, హరుడువేరు
అనుభావము పోయింది
అన్నిటికీ అతీతమైన
నామరూప గుణరహితమైన
బ్రహ్మతత్వమే మిగిలింద

నెల్లూరు, 18-8-77

* శ్రీ యర్రంరె  బాలకృ  రెడ్డి—ఇందుకూరుపేట.
శ్రీ ఓరుగంటి  లకంఠే  ్వర శాస్త్రి—గుంటూరు.

## ముత్తాత

నా పదవతరము మనమడు ఉండకపోవచ్చు
నా ముదిమనమడే ఉండకపోవచ్చు
పురుష సంతాన పారంపర్యం
ఎక్కడైనా నిలిచిపోవచ్చు
నా పదవతరము తాత వుండే వున్నాడు
ఆ పారంపర్యం అవిచ్ఛిన్నంగ సాగుతు వచ్చింది
ఆ ముత్తాతల ముత్తాతను కలియ కోరిక నాకు
ఊహాప్రపంచములో

## 2

మున్నూరు ఏడులముందు,
మా పూర్వీకుడు
ఎట్లా వుండేవాడో, ఎట్లా జీవించేవాడో
కొంచెమైనా తెలియదు మనకు
ఐదుతరాల ముందు, మా వంశవృక్షమే
తెలియదు మాకు
పేర్లూ తెలియవు, ఊరు తెలియదు
పదహారవ శతాబ్దంలో మా ఊరేలేదు
ఎక్కడనుంచి వచ్చి చేరామో మా ఊరిలో
దాని నిర్మాణమైన చాల ఏడులకు.
మా ఇంటిపేరు బెజవాడ
ఎట్లా వచ్చిందో, ఆధారాలేమీ తెలియవు
బెజవాడకు మా వంశానికి
ఎట్లా సంబంధమో ఏ నాటి బాంధవ్యమో
మధ్యలో వచ్చిందో, ఆ నాడూ వుండిందో
మా పూర్వజుడు దండులో చేరి
అచ్చట సిపాయిగ వుండేవాడా
యుద్ధముచేసి, బలియైపోయాడా
వ్యాపారముచేస్తూ, అక్కడికి చనినాడా?
ఏమో, ఏమీ తెలియని ఇతిహాసం.

3

ఆ నాటి మా ముత్తాత
ఎచ్చట కాపురముండేవాడో
పూరింటిలో ఏ వసారాలో వుండేవాడో
బహుశా చదువుకొన్నవాడు కాడు.
తిక్కన పేరు వినివుండడు
భారత కథ కొంత వినివుంటాడు
సీతారాముల కథ వినివుంటాడు
ఏ హిందూరాజు క్రిందో
నవాబు క్రిందో
చిన్నరైతుగా వుండేవాడేమో
సరిగా పండని మెట్టసేద్యంలో
సతమతమయ్యే వాడేమో
నీరు కావి బుడ్డ ధోవతితో
పశువుల కాచేవాడేమో
నెల్లూరు, కావలి పట్టణాల
చూచాడో లేదో
కాశీకి పొయ్యేవుండడు
తిరుపతికి అంతే
ఊరిలోని శివాలయానికో
రామాలయానికో ఎప్పుడైనా
పొయ్యేవాడేమో
ఊరి తిరునాళ్ళ చూస్తూ
ఆనందంగా తిరి వాడేమో
ఊరి జాతరలో పాల్గొని
దున్నపోతుల బలి ఇచ్చేవాడేమో
చెరువుగట్టునో, వేపచెట్టు అరుగునో
చుట్టపీలుస్తూ, కబుర్లు చెప్పేవాడేమో
పురాణాల వింటూ, వీధి భాగవతాల చూస్తూ
సంతోషించేవాడేమో

చిన్న పశువులవ్యాపారం వుండేదేమో
కరవుకాటకాలు వచ్చినప్పుడు
ఎట్లా పోషించేవాడో కుటుంబాన్ని
కొడుకుల ఎట్లా పెంచాడో
జబ్బుచేస్తే, ఎట్టి వైద్యుడుకి చూపేవాడో
అంగ్లేయిలు దేశంలో దిగారని
బహుశా వినేవుంటాడనుకొంటా.
ఎన్నిపోరులు బయట జరిగినా
ఊరుమాత్రం శాంతంగా వుండేదే
ఊరి పెద్దకాపో, కరణమో
మంచిచెడ్డల గమనిస్తుంటారు.

## 4

ఆయన ఊహలో లేనివిషయాలు జరిగాయి
ముదిముది మనవళ్ళు చదువుకొన్నారు
దేశము తిరిగారు పెరుగా బ్రతికారు
మరి మా ముదిమనవళ్ల విషయమేమిటి?
ఎట్లా వుంటారో ఏమిగ వుంటారో
ఏమిగా వున్నా
ప్రగతి యుగాన్నే చూస్తారు
ఇప్పటికన్నా మంచిదైన లోకాన్నే చూస్తారు
నెల్లూరు, 9-10-77

# వాడని పువ్వు

వాగర్థావివ సంపృక్తౌ
వాగ ప్రతిపత్తియే
జగః పితరౌవందే
పార్వతీ పరమేశ్వరౌ

అని మహాకవి ఏ శుభసమయాన
ఏ ధ్యానానంతరం ఏ పూజావశేషాన
ఏ ఆనందపు పొంగున
ఆవేశపు ఉత్సాహమున రచించెనో
ఏ శతా_ పు వత్సరము మాసమున
గటివేళో, రాత్రో, వేకువనో
వెన్నెల, చీకటి రేయిలోనో
పువ్వుల, వానల రుతువులోనో
శరదృతువులోనో, హేమంతములోనో
ఇంటిలో, వనములో రచించెనో
వివరాలేమీ మనకు తెలియవు
ఎంత శక్తివంతమైన శ్లోకము!
సహస్రాబ్దముల ఆయువుతో పుట్టింది
వేలవత్సరాలుగ, పండితులు విద్యార్థులు
సంస తము నేర్చే బాలబాలికలు
కా మ ము నుండి కుమారి వరకు
అస్సాం నుండి సౌరాష్ట్రము వరకు
ఈ శ్లోకముతో అపరిచితులున్నారా?

## 2

సంస్కృత పఠనానికి ఓంకారముగ
సదాచార సనాతన విద్యకు శ్రీకారముగ
రసమయ సాహిత్య నాటకానికి నాందిగ
ఉజ్వల ప్రభాతానికి వైతాళిక గీతముగ
వెలసింది ఉద్దీపిత కాంతితో

సురభిళ గంధముతో
కాళిదాస విరచిత
రఘువంశ ప్రథమశ్లోకము
ఎన్ని తరాలలో, ఎన్ని లక్షల మంది
గురుకుల వాసములో, ఆశ్రమములలో
పాఠశాలలలో, ఈ శ్లోకాన్ని వల్లిస్తూ
మహాసాహిత్య సామ్రాజ్యములో అడుగిడిరో

## 3

వాఙ్మయ ప్రాసాద ద్వారముననే
శ్లోకము హారతియై ఆహ్వానించి
మందిరమునకు ఆరాధకుల పంపుచున్నదా
శారదాపీఠమున, ప్రథమ అర్చనగా
శ్లోకపుష్పము నివేదింపబడుతున్నదా?
విద్యావన వసంతములో, చిగిర్చిన
నవకిసలయ శ్లోకము ఇదే గదా
భాషాకేదారములలో చల్లిన
తొలకరి మబ్బులలో తొలిరస బీజము, ఇదే గదా
శాస్త్రపండితులైనా, విద్యాపారంగతులైనా
వ్యాకరణతర్క మీమాంసల కోవిదులైనా
ఈ శ్లోకమార్గాన్నే సాహిత్య ప్రయాణం
శాస్త్ర విద్యాసౌధ సోపానం

## 4

అక్షరాస్యతకు అ ఆ లవలె
సాహిత్య జ్ఞానానికి పంచకావ్యాల
ప్రథమకావ్యానికి ఆరంభ శ్లోకము ఇదే
వాక్కు లేనిదే అర్థంలేదు
అర్థంలేనిది వాక్కు కాదు
అట్టి వాగర్థములే భాషకు మూలం
సంస్కృత సాహిత్యములో
బహుళ ప్రచారం

ఈ శ్లోకానికి కలిగినంత
ఇంకే శ్లోకానికి లేదు
అట్టి తేజము, మహత్తు, చిరంజీవత్వం
శ్లోకానికి ప్రాప్తించింది
అమరభాషలో అమరశ్లోకమై
రాణించింది
సరళతత్వములోనే పటిమను సాధించింది
ఉపమాలంకారముతోనే ఆరంభించింది
వాణీ వేణిని అలంకరించి వాడని
పువ్వుగా శోభిల్లింది
రచించిన కాళిదాసు ధన్యుడు
అజరుడు, అమరుడు.

నెల్లూరు, **24-10-77**

---

(వాక్కు నర్థంబు గలిసిన పగిదిగలసి
యఖిల జగంబుల తలిదండ్రులయిన య
పార్వతీ పరమేశుల భక్తిగొలు
నమలవాగర్థ విజ్ఞాన మమరుకొఱకు)
శ్రీ ఆదిపూడి సోమనాథరావు—ఆంధ్రరఘువంశము

## తులసీదాసు

భక్తవరేణ్యుడు తులసీదాసు
వినయముతో శ్రద్ధతో రచించె
రామ కథను
రామచరిత మానసమని పేరిడెను
వాల్మీకి కల్పనలో శ్రీరామచంద్రుడు
పురుషోత్తముడు ఆదర్శమానవుడు
శతాబ్దాలు గడిచాయి
రామకథ దేశమంతా ప్రాకింది
వివిధ రూపాలలో
రాముని కీర్తింప సాగారు
ప్రజాదరణలో రామునికి దైవత్వం లభించె
దైవాంశ సంభూతుడు రాముడు
అవతారపురుషుడు రాముడనే
భావన ప్రబలింది
పురుషోత్తమునికి అవతారపురుషునికి
వ్యత్యాసము స్వల్పమే కావచ్చు
దశావతారాలలో రామచంద్రునికి
ప్రధానస్థానమే లభించె
రామాలయాలు వెలిశాయి
రామచిత్రాలు పూజాగృహమున చేరాయి
ధూపదీప నైవేద్యాలు అర్పించారు
అయోధ్యలో అవతరించిన
విష్ణువే రాముడని తలచాడు
అట్టి మహోన్నతభావాన్నే స్వీకరించి
తులసీదాసు తన భక్తి ఆవేశముల
క్రుమ్మరించి వేదాంత తత్వాలను
జోడించి, పామరుల భాషయగు అవధిలో
జానపదులు సహితము గ్రహించే
అతిసరళమగు శైలిలో

అల్ప అల్ప పదములతో
సమాసముల విసర్జించి
గేయ రూపముగ
భజనకు అనువుగ రామచరిత మానసను
రచించి లోకులకు అప్పగించిపోయె
నాలుగు శతాబ్దాలు భూతకాలములో
మిళితమైపోయె, రాజ్యాలు అస్తమించె
ఉన్నత హిమాద్రుల అంకములో
శయనించే మానస సరోవరమున
విహరించే రాజహంస రీతి
పెరుగుచున్న కీర్తిధావళ్యముతో
పండితపామరులకు శిరోధార్యమై
పారాయణగ్రంథమై పూజాసామగ్రియై
వెలయుచున్నది హిందీ సాహిత్యమందిరాలలో
హిందీవారి శ్రద్ధాహృదయాలలో
వాల్మీకి రామాయణమునకన్న
ఉన్నతస్థానమునే గడించె
ఎంత పవిత్రహృదయముతో రచించెనో
ఏ శుభవేళ రామధ్యానముతో
ప్రారంభించెనో
నానాటికి దాని ప్రచారము వర్ధమానమగుచుండె
భారతీయ భాషలలో
ఏ గ్రంథరాజమునకు
ఇంతటి ప్రచారము రాలేదు
పరిమళాలు దేశదేశాంతరాలు
వ్యాపించె
ప్రజలకు సాహిత్యానికి
నికటబాంధవ్యాన్ని స్థాపించె
పండితులనుగాక ప్రజావళిని మనస్సున పెట్టి
గోస్వామి రచించిన ఉత్కృష్ట గ్రంథము

అదే దాని ప్రాశస్త్యము
అదే దాని వాఙ్మయాల రహస్యము
ఉత్తర భారతమును
ఏకధర్మసూత్రాలతో బంధించె
భావైక్యతను సుస్థిరముగ స్థాపించె.

నెల్లూరు, 31-12-77

# నన్నయ భట్టు

రాజనరేంద్రుని అనునయంబున
తెనిగించె నన్నయ భారతమును
సంస్కృతము నుండి లోకుల భాషలోనికి
అదే మొదలు అనువాద సాహిత్యానికి.
సంస్కృతము అమరభాష దేవభాష
అందలి సాహిత్య రహస్యాలను తత్వాలను
పామరుల భాషలోకి తేవడం
అనుచితం అధర్మమని తలచారు పండితులు
దేవభాష దూషితమౌతుంది కలుషితమౌతుంది
రుషి కావ్యాలను ప్రజలకు అందిచ్చుటయా
ఎవరు చేయాకూడని పని చేయనిపని
అంటూ వితర్కించారు గుసగుసలాడారు
పండిత సదస్సులలో విమరి ంచారు
అలజడి మాటలు విమర్శలు గుఃగుసలు
నరేంద్రుని చెవిలో పడ్డాయి
జ్ఞానవిస్తరణకు తత్వప్రచారానికి
భారతకథాశ్రవణానికి పండిత విముఖత్వం
ఆయనను నొప్పించాయి.
పండితులతో సంభాషించాడు
రాజే స్వయముగ నాపూర్వజులు
చంద్రవంశపు రాజులు
పాండవుల కథ విన కుతూహలము
దానిని తెనుగు చేయుడని కోరెను.
అప్పటికే తమిళ కన్నడములలో
భారతములు వెలసినవని రాజుకు తెలియును
రాజే కోర పండితులు చేయునది లేక
మిన్నకుండిరి
నన్నయ్య 'దేవా, నీ అనుమతంబున
విద్వజ్జనంబుల యనుగ్రహంబున

ఈ కావ్యమును రచించెదనని' పూనెను.
తెనుగు సాహిత్యానికి ప్రేరేపించిన
గౌరవము రాజనరేంద్రునికే దక్కెను
కావ్య ప్రారంభానికి కారణభూతుడాయె
సాహిత క్రతువులో అధ్వరుడాయె
ఆకాశ గంగను భూలోకగంగ
తీర్చిదిద్దిన రాజనరేంద్రుడు
తెలుగులోకాన సాహిత్య భగీరథుడాయె

## 2

నన్నయ్య పథప్రదర్శకుడయ్యాడు
తెలుగుసాహిత్య భవిష్యత్తునే నిర్మించాడు
ఆయన గీచిన గిరిలోనే చూపిన హద్దులలోనే
భాషామయూరం నృత్యం సల్పింది
గద్యపద్య యుతచంపువుగ వుండాలని
భిన్నవృత్త గమనముతో వుండాలని
సంస్కృత వృత్తాలు తెలుగు సీస కందాలు
కలసి మెలసి వుండాలని
తత్సమ తద్భవదేశ్య పదములతో
బహుదీర్ఘము కాని సంస్కృత సమాసాలతో
తెలుగుపద్యాలు అలరారాలని
సంస్కృత వ్యాకరణ సూత్రాలన్నీ పాటించాలని
సంస్కృతములో లేని యతి ప్రాసనియమాలను
అనుసరించాలని
మిశ్రసమాసాలు కూడవని
కొన్ని నియమాలను పెట్టుకొని
కావ్యరస జగత్తును సృష్టించె.
ఆ నియమాలె ఆ నిషేధాలె
ఈ దశ శతాబ్దాలుగ
శిరోధార్యమాయె కవులందరికి
శివకవులు ధిక్కరించి ద్విపదలలో రచించారు

తమ కావ్యముల
నన్నయ శాసనముచే వానికి
కావ్యప్రాశస్త్యము దక్కదాయె
వెయ్యియేండ్లు సాహిత్యార్ణవాన్ని శాసించి
ఒకే పరిధిలో నడిపించె
నేటివరకు మార్గ కవితావాదులకు
ఆ నియమాలే శరణ్యములాయె
నలిగిన బాటే వారికి సుళువాయె
క్రొత్తరీతి క్రొత్తప్రయోగము
దూషితమని విడనాడారు
తర్వాత కవులు
పాండిత్య ప్రకరను చూపుచు
భాషను మరింత  లినము చేశారు
తెలుగు వేషముతోనే
తెలుగు జనులకు దూరముగ నిలిచారు
తెలుగును సర్వదేశ భాషలలో
కఠినతమము చేశారు

## 3

నన్నయ్య అనువాదరీతిని నిర్దేశించి చూపాడు
మూలమును సంక్షిప్తపరచి
కొన్నింటిని పరిహరించి
వలసినచోట్ల విస్తరించి
పురాణమును కావ్యముగ రూపొందించి
అనువాద రీతిలోను మార్గదర్శకుడయ్యాడు
సాహిత్య భాషాకనకాన్ని
తన మూసలోనే కరగించాడు
ఇష్టమైన రూపురేఖలు తీర్చాడు
కావ్యగంగకు గంగోత్రివలె భాసించాడు
తెనుగు కావ్యసాహిత్యానికి ఆద్యుడయ్యాడు
ఆంధ్ర కావ్యభాషకు పితృపాదుడయ్యాడు

ఆయనపెట్టిన బిక్షే అందరికీ
శ్రీరామ రక్ష అయ్యింది
భవిష్యత్తు ద్రష్టయై కావ్యసృష్టిని చేశాడు
సాహస్రాబ్దములు
సాహిత్య భాగ్యవిధాతగ నిలిచాడు
తమిళదేశములో ఇప్పటికీ
భారతము చెప్పేవారిని భట్టు అని పిలుస్తారు
నన్నయ్యభట్టు అయ్యాడు
నారాయణ భట్టు సాయము పొందాడు
నన్నయ్య మరొక విధముగ ప్రారంభించితే
సాహిత్య స్వరూపము ఎట్లా వుండేదో
వాల్మీకి రామాయణమువలె
వ్యాసభారతము వలె
కాళిదాసాది కవుల కావ్యాలవలె
నిర్వచనమై తెలుగు భారతమయ్యుంటే
గేయములుగ వ్రాసియుంటే
ఏకవృత్తములో అశ్వాసమంతా నడిచుంటే
తెలుగు ఛందములలోనే వుండుంటే
అన్నిటికన్న యతి సంస్కృతములో వలె
విరతిమాత్రమయ్యుంటే
సంస్కృతములో లేని ప్రాస లేకుంటే
ఎంత మార్పు జరిగుండేది
అం సాహిత్యములో
ప్రా అనవసర అలంకారమైంది
పడికట్టురాళ్ళు, వ్యర్థమైన పదాలు
మారుమూల పదాలు క్లిష్టపదాలు
చేరి కూర్చున్నాయి సాహిత్యంలో
ప్రాసే లేకుండిన భాషాస్వరూపమే మారేది
భాష మోయలేని నగను తొడిగారు
వచ్చిన లాభంకన్న శ్రమ అధికమైంది

ప్రాప్తితక్కువ, సాధన ఎక్కువైంది
సంస్కృతములో బహుళ ప్రచారంలోలేని
వృత్తాలను చేపట్టి
పెద్ద సమాసాలకు పీఠము కట్టారు
భాష కఠినమగుటకు దారితీశారు
నన్నయ చూపిన మార్గానపోయి
భాష ప్రజలకు దూరమయ్యింది
పండితకవులకు మాత్రము గ్రాహ మయ్యింది
కావ్యాలకు టీకాతాత్పర్యాలు అవస మయ్యాయి
కావ్యాల కఠినము చేసి
టీకల ప్రాపున అర్థము చెప్పారు
మిశ్రసమాసాలు కూడ వనితలచారు
హరివిల్లు ప్రాణగొడ్డము కరకంఠుడు
మాత్రము కవిప్రయోగాలని ఒప్పారు
భాషను పెరగనీక అడ్డుపడ్డారు
పాతకవుల వ్రాతలను అచ్చున దిద్దారు
అట్లా శాసించాడు భాషను దీర్ఘకాలము నన్నయ్య
మహోపకారమే చేశాడు
భాషకు రూపురేఖల దిద్దాడు
అందచందాలను కూర్చాడు
అక్షర రమ్యత చేర్చాడు
వానితోబాటు కొన్ని కష్టాలు కూడ తెచ్చిపెట్టాడు
మహానుభావుడు ఆదరణ యోగ్యుడు
కాని క్రొత్తబాటలో కొంత నడవాలె
భాష ప్రజలకు కొంత దగ్గర రావాలె

నెల్లూరు, **22-1-78**

# పెండ్లికూతురు

తల్లితండ్రులు సుసంపన్నంగా
ఉండిన దినాలలో పుట్టింది ఆమె.
వ్యాపారంలో నష్టాలు వచ్చి
ఆస్తి చాల భాగము కరగిన రోజుల్లో
వివాహమైంది ఆమెకు
సాలంకృతయై మెల్లమెల్ల అడుగులతో
వివాహమండపం ప్రవేశించింది
లజ్జాభరితయై క్రీగంటి చూపులతో
చూసింది కాబొయ్యే భర్తను
మంత్రాలమధ్య మాంగళ్యధారణము
దీవెనల అక్షింతలు అరుంధతి దర్శనము
యథావిధిగ జరిగాయి
తల్లితండ్రుల ముఖములు
ఆనందముతో కళకళలాడేయి.
చిరునవ్వులతో ఆనందాశ్రువుల రాల్చారు.
తమపైనున్న పె ిబాధ్యత తీరిందన్నారు
నెత్తిబరువు తొలి ందన్నారు
బంధువులంతా సంతోషంతో
అభివాదాల తెల్పారు,

## 2

వివాహమండప వీక్షణ వెనుక
ఎంత నిరీక్షణ ఒదిగి వుండిందో
ఎన్నో సంబంధాలు చూచారు
కారణం లేని కారణాలవల్ల
ఏదీ కుదరకపోతూ వుండింది
మంచి కుటుంబములో
మంచి వరుని సంరక్షణలో
అమ్మాయి భవిష్యత్తు అమరాలని

తల్లితండ్రులు కోరుతువచ్చారు
ఎన్ని నోములు నోచిందో
ఎన్ని వ్రతాల ఉపవాసా లుండిందో
ఎన్ని దేవుళ్ళకు పూజలిచ్చిందో
ఎందరు స్వాముల ఆశీర్వాదముల పొందిందో
నిద్ర తెలియని ఎన్ని నడిరేలు గడిపిందో
ఆ తల్లి మనము లెక్కించలేము
నిరంతరము అదే తలపు అదే ధ్యానము
అమ్మాయికి సరియైన వరుడు రావాలని
జ్యోతిష్కులను పండితులను
విచారిస్తుండేది
చుట్టాలను స్నేహితులను
అనువగు సంబంధము చూడమని
కోరుతునుండేది
తల్లిగా అనురాగముతో దైవభక్తితో
చేయగలిగినదంతా చేస్తూ వుండేది.
తండ్రి కూడ అదే ధ్యాసలో వుండేవాడు
అనాదిగ మర్యాద కుటుంబము
చితికి తగ్గిపోయింది
కుమార్తెకు కొరత లేకుండాలనే
కోర్కె వారిని ఆవరించే వుండేది
గారాబముగ పెంచారు
కావలసినదంతా యిచ్చారు.
చిన్న జబ్బులకు పెద్దమందులే వాడారు
కుటుంబ దైన్యపు సెగ అమ్మాయికి
తగలకుండ చూచారు.
ఇంటికంతా తేజోమూర్తిగ
తల్లిదండ్రుల నయనజ్యోతిగ
పెరిగింది అమ్మాయి
చదువు సంగీతము నేర్పించారు

అందమైన పొడుగైన అమ్మాయే
మంచి స్వభావంగల అమ్మాయే
కాని పెండ్లిగడియలు రాలేదు
వధూవేషములో పెండ్లి బాషికముతో
నిలిచే యోగము ఇప్పటిదాకా రాలేదు

## 3

అమ్మాయి భవిష్యత్తు విషయమై
ఊహలు ఊహిస్తుండేదే
సహవిద్యార్థినుల వివాహాలను
చూస్తూ వుండేదే
పెళ్లైన స్నేహితురాండ్రు
వ్రాసే ఉత్తరాల చదువుతు ఉండేదే
వారి ఆనందాలకు
ఆనంద పడుతూ ఉండేది
వారి సంతోషపు సూర్యకాంతికి
తన కనా హృదయ కమలం
విప్పారుచునుండేది
వారి వైభవ దాంపత్య కల ధ్వనులకు
హృదయ వీణమ్రుఖరితమగుచుండేదే
కాని అప్పుడప్పుడు ఒంటరిగ
నైరాశ్యపు నిటూర్పుల విడిచేది
నిశీథవేళల న్నులు చెమ్మగిల్లేవి
యౌవన స్వప్న నూపురరవములు
నీరవములై పొయ్యేవి
ఎలప్రాయపు తెరపై
ఆడే కలలు కల్లలగునేమోనని
ఆశంకామేఘాలు ముసిరేవి
ఆమె ఊహావియత్ దిగంతాల
అనిశ్చిత భవుష్యత్తు మంజూషాన్ని తెరచి
వధూభూషల తొడుగుతుందా

సీమంత సిందూరము దిద్దుతుందా
అట్టి తలపులు కలతపెట్టుచునుండేవి

## 4

అన్ని నిరీక్షణ క్షణాలు దాటాయి
మాతా పితారుల ఆశావల్లరులు పుష్పాల తాల్చాయి
కోర్కె చెట్లు పండ్ల గుత్తుల నిచ్చాయి
సంకల్ప సిద్ధి అయింది
పెండ్లి పరీక్షలు గడిచాయి
పెండ్లి ముహూర్తం పెట్టారు
కౌమారభావాలు సజీవములయ్యాయి
వివాహమండపములో
వధువు వరునికి క్రీగంటి వెలుగుతో
హారతి పట్టింది
వధూవరుల హృదయ నాట్యశాలలో
ఉద్వాహ మంగళవాద్యాల మధ్య
దాంపత్య మనోరథాలే నృత ము సల్పాయి
సుఖీభవ సుమంగళీ భవ
అంటూ అందరు అక్షతల వేశారు
తల్లి తండ్రులు
ఆనంద మందస్మితసుమాల చల్లారు.

నెల్లూరు, 26-3-78

# వైధవ్యం

పెండ్లైన మూడు యేళ్లకే భర్త మరణించాడు
తికిన వాళ్లకే దుఃఖాలు, అగ్నిపరీక్షలు
్రకి జీవిత శాశ్వత అవమానం వైథవ్యం
పిడుగుపడ్డ చెటుమాదిరి మ్రోడై వుంటుంది
తిరుగులేని శా ము నెత్తిన వ్రాలింది
చచ్చిందొకరు శాపాన్ని అనుభవించేది మరొకరు
ఏ పండుగులకు పెండ్లిండ్లకు వెడలేదికాదు
ప్రొద్దున్నే తన ముఖము ఎవరు చూస్తారో
అని భయపడుతుండేది
ఉనికి, ముఖం, దృష్టి స్పర్శ
శాపదంష్ట్రమని తలచుచునుండేది
శుభ్రమైన అలంకారాలకు నోచుకొనలేదు
రుచికరమైన భోజనము అంతమాత్రమే
పూర్వజన్మ దుష్కృతము
వెంటాడుచున్నదనే విశ్వాసం
ఆత్మవిశ్వాసాన్ని కోల్పోయి
నిరంతర సందేహాలతో సతమతమయ్యేది
సుఖాన్ని సంతోషాలను వదలిన
జీవితమే అలవాటైపోయింది
చీరలలో మంచిది కట్టుకుంటే
ఎవరైనా చూస్తారేమోయని కలవరపడేది
బిగ్గరగ మాట్లాడటం, నవ్వడం అసలే మరచింది
హ దయం మంచువలె గడ్డకటింది
విషాదమూర్తిగ, సజీవచ్ఛాయ ఇంట్లో వుండేది
పూజాశ్లోకాలతో, పురాణ కాలక్షేపాలతో
జపమాలతో రామకోటితో కాలము గడిపేది
కాలం బరువుగా దీర్ఘంగా గడిచేది
వారానికి పది దినాలుగ వుండేది
ఉదయం సాయంత్రం కావడానికి

రాత్రి చీకటి దొంగలకాటుక చేతులనుండి
బయట పడడానికి చాలకాలం పట్టినట్లుండేది
పెద్దబరువును జీవితమనే కొండమీదకు
మోసుకుపోతున్నట్లుండేది.
భర్త పొయ్యేటప్పటికి సంవత్సరం కూతురుండేది
పెద్ద నల్లమబ్బు అంచున కన్పించే
వెలుగు గీతగా వుండింది
ఎడారి ప్రయాణంలో కన్పించే
నీళ్ల గుంటవలె వుండింది
ఎండాకాలము సాయంకాలము
వీచిన చల్లగాలివలె వుండింది
దుఃఖసముద్ర వక్షముపై
శయనించే ద్వీపమువలె వుండింది
సంతోషములేని గారాబముతో పెంచింది
నవ్వులులేని ప్రేమతో పెంచింది
భావాలన్నీ ఆ బిడ్డమీదనే కేంద్రీకరించేవి
అనురాగాల మూటగ, కోరిక మాగాణాల పంటగ
మౌన వాత్సల్యాన్ని బిడమీద కురిపించేది
పెంచే దాసీలున్నా, వలసి వివరాలన్నీ ఆమె
స్వయముగ చూచేది
దుఃఖాన్ని కూతురువద్ద ఎన్నడూ చూపేది కాదు
దుఃఖ విషాదజ్వాల బిడ్డను అంటరాదని తలచేది
బిడ్డ ఎప్పుడూ సంతోషముగా వుండాలనే కోరేది
బురదకు పుట్టిన కమలమువలె
నవ్వుచు వుండాలనే కోరేది
హాలాహలాన్ని తాను,
అమృతాన్ని బిడ్డ తాగాలని కోరేది
రాత్రి చీకట్ల కడుపుకన్న
సూర్యబింబమై వెలయాలని కోరేది
తల్లి కానరాని వగపు నీడలక్రింద

బిడ్డ బాగా పెరిగింది
ఎదిగింది, చదివింది, పెండ్లియీడు వచ్చింది
మంచి సంబంధమే కుదిరింది
అన్నివిధాల అర్హుడైన వరుడే దొరికాడు
పెండ్లితేది నిశ్చయించారు.
పెండ్లికి రమ్మని చూడమని అమ్మాయి కోరింది
నేను రాలేనమ్మా అని తల్లి చెప్పింది
మరలా మరలా బ్రతిమాలింది
నా పెండ్లికి నీవు రాకుంటే ఎట్లమ్మా
అని గద్గద రంతో బ్రతిమాలింది
మొకం త్రిప్పుకొని, కళ్లల్లోని
తేమను తుడుచుకొంటూ
'నేను రాకూడదు, తల్లీ'
అని కడపటి మాటగ చెప్పింది
పెండ్లికూతురు నివ్వెరపోయింది
తెలిసీ తెలియని మాయలోకంలో
ఉన్నట్లనిపించింది
లోకమర్యాద రహస్యాల తెర కూలినట్లనిపించింది
వివాహం జరిగింది
వివాహ అలంకారాలతోనే
వధూవరులు తల్లివద్దకు వచ్చారు
ఇద్దరి చేతుల పట్టుకొని
వరునిచేతిలో వధువు చేతినుంచి
నా ఇల్లు, ఆస్తి అంతా తీసికొని
కలకాలం, సుఖంగా వుండాలె
సుమంగళీభవ, అంటూ
తొలిసారిగ సంతోషాన్ని చూపింది
తొలిసారిగ రెండు ఆనందాశ్రు
బిందువుల రాల్చింది
ఎండ వాన దోబూచులాడుచున్నట్లుండింది

తల్లి జీవనప్రాంగణములో వేసిన
రంగుల ముగ్గులు చెరిగిపోయాయి
యౌవనోత్సవ సభామండపంలో
వెలుగవలసిన ఆనంద ప్రదీపాలు ఆరిపోయాయి
ప్రమోదవన వసంతములో
మొగ్గలు తొడగకనే ఆశాలతలు వాడిపోయాయి
మధ్యాహ్నము ఎరుగకనే
రవి పడమట మరుగైనాడు
కాని ఒకే ఒక కోరిక ఎదమడుగులో
తేలుచు వచ్చింది
ఆస్తి అంతా కూతురిదే
తన తలవ్రాతలో ఒక పాలైనా
కుమార్తెకు చెందరాదనే విన్నపాలతోనే
జీవితాన్ని మోసుక వచ్చింది.

నెల్లూరు, 8-6-78

వ్రజ విహారి

శ్రీకృష్ణుడనగానే
నిత్యోల్లాసి
ఆనందమయుడు
ప్రేమాస్పదుడు
వేణుగాన లోలుడు
బృందావన విహారి
జలక్రీడా సక్తుడు
రాసక్రీడ వినోది
గీతా ప్రబోధకుడు
విశ్వరూప దర్శకుడుగ
మన మనస్సు తెరపై
ఇన్ని చిత్రాలు స్మరణకు వస్తాయి
చిత్రస్మరణ, వెనుకటి
కథనంతా స్ఫురణకు తెస్తుంది

**2**

అధర పల్లవాలపై
మందస్మిత ముకుళాలు పూయ
అర్ధనిమీలిత నేత్రుడై
నిత్యానంద మూర్తియై
సర్వజనాకర్షకుడై
చిరప్రేమికుడై
వసంతావతార పురుషుడై
ఉత్తేజపరుస్తాడు కృష్ణుడు.
విషాదమూర్తిగ రాముడు కనిపిస్తే
ఆనందమూర్తిగ కృష్ణుడు కనిపిస్తాడు
సంతోషాలతోనే వసంతాల నాడుతాడు
ఆనందాలతోనే రాసక్రీడలు జరుపుతాడు
ఉత్సాహానిచ్చే వేదాంతాన్నే చెప్పుతాడు

దుఃఖభాజనుడుగ కాన్పించడు
దిగులుతో దించిన మొగముతో కాన్పించడు
కృష్ణుడు విలపించిన ఘట్టములేదు
అంతా నవ్వే, అంతా గానమే
ఉల్లాసమే, ఉద్వేగమే,
కాని గతచరిత్రను నెమరువేస్తే
నిదానంగా పరిశీలించి చూస్తే
ఆయన జీవన శశాంకునికి
రాహుకేతువులున్నారు
జీవన చందన తరువును
నాగుబాములే చుట్టాయి
నిత్యానంద మధుమాసంలో
అమావాశ్యా తిమిరాలున్నాయి
కంసుని ఆనతిచే
తల్లితండ్రుల జైలున పెట్టారు
భయభీతులతో మెలగుచుండినారు
భయవిహ్వలయైన దేవకి ప్రసవించింది
జైలు కటకటాల వెనుకనే
భీషణ కఠారుల మధ్యనే
కృష్ణుడు జన్మించె బందిఖానాలో
తోడనే ఎవరికి ఎరుకలేకనే
కాళరాత్రి, సర్పభూయిష్టమైన
యమునా తరంగిణిని దాటి
కృష్ణుని తలనిడి వాసుదేవుడు
గోకులము చేరి, గోశాలలో
నివసించే యశోదకు పుట్టిన శిశువును
తెచ్చెను, కృ ని నటనుంచి.
యశోదే తల్లిగ, ందుడే తండ్రిగ
రాచరికమును వదలి
రాజప్రసాదముల వీడి
యాదవ కులమున

క్షుద్ర కుటీరములోనే
పెరిగి పెద్దవాడాయెను కృష్ణుడు
సొంత తల్లి తండ్రుల తెలియని కబోది
నిజ మాతాపితరుల ప్రేమవంచితుడు
రాజబాంధవముల త్రెంచుకున్నాడు
పశువుల కా రిగ పెరిగాడు
నవనీత చోరుడు, దుకూల చోరుడు
అని పేరు గడించాడు కృష్ణుడు.
కంసుని కోపమునకు ఆహుతియై
ఏడుగురు సోదరులు చచ్చారు
కృష్ణుని వెదకుచు కంసుని క్రోధము
వెంటాడుచునేయుండె అహర్నిశలు
మాయోపాయముల పన్నుచు
శకటాసురుని, పూతనను
పంపెను కృష్ణుని చంపుటకు
మరికొందరు రాక్షసులను
ఎదుర్కొనెను బాలమున
సంహారములతోనే డచెను
తన చిన్నతనమంతా
కాళియుని దర్పమణగించి
సకుటుంబముగ పంపెను యమపురికి
ఇంద్రుని పంపున వచ్చిన
అవిరళ వరధారల హరింప
ఎత్తెను గో ర్ధన గిరిని
మదమత్తేభమును ఢీ కొనెను
మల్లయుద్ధమున నిపుణత్వము చూపించె
మేనమామ కంసుని పరిమార్చవలసి వచ్చె
రాక్షసుల బారినుండి తప్పించుకొని
ఎడారిలో సముద్రతీరాన
ద్వారకను నిర్మించె
పరిణయమాడుటకు రుక్మిణిని

అపహరింపవలసి వచ్చె
బావ మరిదిని ఓడించి
శిశుపాలుని అంతమొందించె
ద్వారక రాజ్యమును
యాదవుల కైవసము చేసి
తాను హస్తినాపురమును చేరె
జూదమున ఓడి, రాజ్యాన్ని పోగొట్టుకొని
వనవాసాలకేగు, పాండవుల స్నేహితుడాయె
సభామధ్యమున, అందరి రాజుల ఎదుటనే
బలాత్కారమున, వివస్త్ర కాబోయిన
ద్రౌపది పరువును కాపాడె
కృష్ణుని సాయము, సమయాన రాకుంటే
ఎట్టి ... శ్యమును కాంచేవారో
అతిరథులు మహారథులు
దుర్యోధన కర్ణులతోపాటు, భీష్మద్రోణులు
జుగుప్సాకరమగు ప్రమాదమునే తప్పించె
యుద్ధము ముగియగ, పాండవులకు
రాజ్యముకట్టి, ద్వారకకు చనెను.
యాదవులు పోట్లాడుకొని
వంశ నాశనము చేసుకొన్నారు
రాజ్యములో విధవలు కన్యలే కాని
పురుషులందరు మడిచారు
అట్టిరాజ్య దృశ్యాన్ని కనలేక
అరణ్యాలకు ఏగాడు
వేటకాని బాణానికి గురియై
పంచత్వమును పొందాడు.

## 3

మహామానవుడు చివరకు
ఎట్టి అవసానాన్ని పొందాడు!
ఆనందాల వేణుగానాల

యమునాతీర బృందనృత్యాల
గీతాప్రవచనాల, విజయ ఘోషల
వెనుక, ఎట్టి తెర ఆవులిస్తుంది?
జననము బాల్యము
వివాహము మరణము
అన్ని విషాద ఘట్టాలై
విషమ పరిస్థితులై
కాని, అన్నిటినీ కాలదన్ని పైకి ఎదిగాడు
త  జ్ఞుడై, సమదర్శియై నిలిచాడు
ృష్ణుడు నిత్య వసంతం
కృష్ణుడు జ్యోత్స్నాహసిత నిశీథము
నిత్యానందం, నిత్యకళ్యాణం
సర్వదాప్రేమాస్పదుడే శ్రీకృష్ణుడు

నెల్లూరు, 19-8-77

